

మందసోర్(జి) ఉతానాలో శ్రీగోవిందదాస్ కుమార్తె
(1 ½) సం॥ చి॥ పాయల్ గోమాత పాలు త్రాగుతూ....



కాకినాడ : జిల్లాలో గోరక్షారథయాత్ర అనంతరం జిల్లా కలెక్టర్ గార్కి
గోరక్షకై చట్టాన్ని తేగోరుతూ వినతి పత్రం సమర్పిస్తున్న వి.హిం.ప. కార్యకర్తలు.



# 'విశ్వహిందు'

సంపుటి : 11 సంచిక : 7 ఈశ్వర - ఆషాఢం జులై - 1997

ప్రధాన సంపాదకులు :

**ప్రొ. బి. రామరాజు**

సంపాదకులు :

**బంగళి సుందరరావు**

సలహా మండలి :

**శ్రీ పి.వి.యస్.నాయుడు**

**డా. కసిరెడ్డి వెంకటరెడ్డి**

చందా వివరములు

జీవిత సభ్యత్వం రూ. 500.00

వార్షిక చందా - రూ. 50.00

- రూ. 5.00

డి.డి.లు '**విశ్వహిందు**'

అని మాత్రమే పంపవలెను.

చిరునామా :

'విశ్వహిందు'

4-5-212, ''విజయశ్రీ''

కోఠి, భాగ్యనగర్ - 500 095.

ఫోన్: 4617799, 591322.

ఈ సంచికలో .................... పుట



ముఖచిత్రం : వటవృక్షం, తులసి కోట

ఆషాఢమాసం (జులై నెల) లో భారతావనిలో మహాత్ములు, మహా మహు లెందరో జన్మించారు. వారి స్మృతి చిహ్నంగా మనం జయంతులు జరుపు కుంటుంటాం మంచిదే. అంతటితో సరిపోక ఆ మహనీయుల మార్గ దర్శనంలో వారి అడుగుజాడలలో నేటిమన ప్రభుతలు, నాయకులు నడిచి ప్రజలను నడిపించి దేశ సర్వతోముఖాభివృద్ధికి దోహదపడడం అత్యంత అవసరం కదా.

అపౌరుషేయాలైన వేదాలు విభజించి విజ్ఞానం విరజిమ్మి భారతికి విశ్వగురు స్థానాన్ని కల్పించిన వ్యాసమహర్షి జయంతి గురుపూర్ణిమగ జరుపుకుంటాం యీ మాసంలో.

మన్యం వీరుడు అల్లూరి సీతా (శ్రీ) రామరాజు శతజయంతి ఉత్సవాలు జరుపుకుంటాం. తెల్ల ప్రభుత్వం గుండెల్లో బల్లెమై, అనేక పోలీసు స్టేషన్లు కొల్లగొట్టి గడగడలాడించి చివరకు మన్య ప్రజల ప్రాణరక్షణకై తెల్లముష్కరుల తుపాకి గుండ్లకు ఎదురునిల్చి ఆహుతియైనాడు.

అలాగే తిలక్ మహాశయుడు, 'స్వాతంత్ర్యం నా జన్మహక్కు' అని చాటి 'మంత్రులు ప్రజలను పాలించగలరే (స్వార్థంతో) గాని సత్పౌరులను తయారుచేయలేరు, ఆ అవకాశం మంచి ఉపాధ్యాయునికే ఉంది' అంటూ దేశం, జాతి కొరకు శ్రమించాడు. ఆయన జయంతి జరుపుకుంటాం.

అలానే శ్యాంప్రసాద్ ముఖర్జీ " ఏక్‌దేశ్‌మేదో ప్రధాన్, ఏక్‌దేశ్‌మే దోనిశాన్, ఏక్‌దేశ్‌మే దోవిధాన్ నహీచలేంగే" అంటూ అఖండ భారత ఉద్యమం నడిపి, జనహితం దేశహితం కొరకు పనిచేశారు. ఆయన జయన్తి జరుపుకుంటాం యీ నెలలో.

జయంతులు, జయంత్యుత్సవాలు నామ కార్థం జరిపి చేతులు దులుపుకొంటే ఆయా మహాత్ముల, మహనీయుల కపచారము చేసినట్లా, కృతజ్ఞత

ఆలోచన,-నేటి ప్రధానుల, ముఖ్యమంత్రుల, మంత్రుల, ప్రభుత్వాధినేతల, ఉన్నతోన్నత ఉద్యోగుల రాజకీయనాయక, ఉపనాయకుల తీరు, తద్వారా దేశం, సమాజము అనుభవిస్తున్న కడగండ్లు కని,విని – కలుగక మానదు కదా?

పశుగ్రాసం మొదలు పేద ప్రజల కడుపు గొట్టే అనేక స్కాముల స్వాములు పశువులకన్నా కాదు కాదు క్రూరమృగము, కాలసర్పముల కన్న క్రూరాతి క్రూరులై, దేశాన్ని ప్రజలను పీడించడం, వ్యాసుడు, సీతారామరాజు, తిలక్, ముఖర్జీ లాంటి అనేకానేక మహనీయుల గన్న యీ పవిత్ర భారతమాతను అవమానించి నట్లుకాదా?

అందుకే ఇట్టి స్థితిలో మాతను, భరతమాతను రక్షించుకునే దారి భారతీయ పౌరులపైనే ప్రధానంగా లేదూ? అందుకే ఉత్తిష్టత, జాగృత, ప్రాప్యవరాన్ని బోధిత''.– జైహింద్.

కన్నగ్రుడ్లు మ్రింగు కాల సర్పము కన్న
నరుల మాంస భక్షణంబు కోరు
మృగము మించి ప్రజల మృతికి ప్రభువులైరి!
విశ్వహిందు వాణి వినుడు వినుడు.

– సుందరం.

## పక్షపాతమెందులకు

అల్పసంఖ్యాకులకు ఆరాధ్యుడయిన బుద్ధభగవాను జయంతిని గురించి రాష్ట్రపతి, ప్రధాని జాతికి శుభ సందేశాలు అందచేసారు. భారతీయులందరికీ ఆరాధ్యుడయిన శంకరాచార్య జయంతిని గురించి ఏ సందేశము లేదు. ఈ విధమయిన పక్షపాతము చూపుట చేతనే కొన్ని రాజకీయ పార్టీలు హిందువులకు దూరమగుచున్నవి. ఆ కారణంచేతనే దేశభక్తిగల రాజకీయపార్టీలు ఆవిర్భవించినవి. ఈ విషయమును ఇప్పటికయిన గమనించప్రార్థన. ఈ పక్షపాత వైఖరి ఏ హిందువునకు సహన యోగ్యము కాదు.

– వి. యల్. నారాయణ శాస్త్రి.

విజ్యం ధనుః కపర్దినో విశల్యో బాణ వాగ్ం ఉత
అనేశన్న స్యేషవ ఆభురస్య నిషఙ్గధిః।

రుద్రుని విల్లు అల్లెత్రాడు లేనిదై, అమ్ముల పొది బాణరహితమై బాణములు హింసా దూరములై, కత్తి వొర అలంకార ప్రాయము మాత్రమే అయి మంచి వారిని బాధింపకుండుగాక!

యా‘తే హేతి ర్మీ’ ఢుష్టమ హస్తే’ బభూవ తే ధనుః
తయాస్మాన్ విశ్వ తస్త్వమ యక్ష్మయా పరిబ్బుజు’’

మీడుష్టమ అనగా భక్తుల కోరికలను విశేషించి అనుగ్రహించు వాడా అని అర్థము. ఫలమపిచ వాంఛా సమధికం అని ఆదిశంకరులు ప్రస్తుతి చేసినట్లుగా కోరుకున్న దాని కన్నా ఎక్కువగా యిచ్చేవాడు రుద్రుడు. యక్ష్మ శబ్దానికి రోగమనని అర్థము. అయక్ష్మ అనగా భక్తుల కారోగ్యమును ప్రసాదించువాడుగా మమ్ము అన్ని పాపాల నుంచీ, అన్ని రోగాలనుంచీ కూడా రక్షించు మని ప్రార్థన.

నమస్తే అస్త్వాయుధాయా నాతతాయ ధృష్ణవే

ఉభాభ్యాముతతే నమో బాహుభ్యాం తవ ధన్వనే॥ నీ భక్తులు కాని వారలకు నీ రెండు చేతులును చాలా భయం కరమైనవి. అట్టి చేతులకు, ఆ ఆయుధములకు నమస్కారము.

పరితే ధన్వనో హేతి రస్మాన్ ‘వృణక్తు విశ్వతః’
అధోయ ఇషుదిస్తవారే అస్మన్నిధే హితమ్॥

నీ ఆయుధాలు మాకు గానీ, మా వారికి గానీ కీడు చేయకుండుగాక. అవి మా శత్రువుల వైపు మళ్లింపబడుగాక! మన పాపకర్మములు మన శత్రువులు. మన పాపములు నశించుగాక మనియు అర్థము.

నమో హిరణ్యబాహవే సేనాన్యే దిశాంచ పతయే నమః॥

రుద్రుడు సర్వేశ్వరుడు అతడు దివ్య మంగళ విగ్రహుండు. సూర్య మండల మధ్యవర్తి (అంతరాదిత్యోపాసనన) హిరణ్మయుడు. కేవలము బంగారమే బంగారు శరీరమున బాహువులు అనగా చేతులును బంగారమే కదా! ఈ శ్వరుని చేతులు ఎలాంటివి? హితవములు మరియు రమణీయములు – కనుక హిరణ్మయములు ఆ చేతులతో ఆతడు సేనలను నడుపుతున్నాడు. సేనలనగా సమూహములు. చేతనములు, అ చేతనములు అను సమూహములను భగవంతుడు నడుపుతున్నాడు. చెట్లు, మనుష్యులు, జంతువులు మొదలగునవి చేతనములు అ మట్టి, నీరు, అగ్ని, గాలి, ఆకాశము – ఇవి. చేతనములు. ఈ రెండు సమూహములను నడిపించు వాడు.

దిక్కులనగా వ్యవస్థలు – ద్రవ్యము, గుణము, కర్మల వ్యవస్థ, ధర్మము, అధర్మముల వ్యవస్థ. ఈ వ్యవస్థలను వాటికి అనుగుణంగా ప్రవర్తింపజేయువాడు కనుక దిశాంచపతి’’ అతనికి నమస్కారము.

సంసారవృక్షము వేదములలో (అహంవృక్షస్యకేరివా) స్మృతులలో ( ఊర్ధ్వమూల మధశ్శాఖం అశ్వత్థం ప్రాహురవ్యయమ్) వర్ణింపబడియున్నది. ఆ వృక్షరూపమున గన్పట్టు రుద్రునకు నమస్కారము. ఆ వృక్షము లెటువంటివి? వివిధ కర్మలను ప్రతిపాదించు అనంత కేశజాలముతో నిండి యున్నది. త్రైగుణ్యావిషయా వేదాః, నిస్త్రైగుణ్యో భవార్జున యని గీత. ఈ త్రిగుణాత్మకము - సత్త్వ, రజస్తమో గుణములతో చేసే కర్మలు అనే కేశజాలము, క్లేశ జాలముగా సంసార వృక్షమున నిండియున్నది. పశుపతికి నమస్కారము. మనుష్యులును రెండు కాళ్ల పశువులే. పాశములచే కట్టబడుట పశులక్షణము. జీవులు సంసార పాశబద్ధులు గదా! ఈ జీవులన్నిటికిని పతి పశుపతి - రుద్రుడు. భగవంతుడు ఎన్నో ఉపాధులలో మనకు దర్శన మిచ్చుచున్నాడు: చెట్లు, నాలుగు కాళ్లజంతువులు ద్విపాత్ మనుష్యులు - ఈ ఉపాధులన్నిటిలోనూ దృశ్యమానమగు రుద్రునకు నమస్కారము. ఆతని సర్వాంతర్యామి త్వమును తెలుపుట.

---

# ఇద్దరు హిందువుల సంభాషణ

**- జి.యం. జగిత్యాని**

అతను ప్రశ్న : హిందువులు విగ్రహారాధకులా?

ఇతర మతస్థులు విగ్రహారాధకులేనా?

నేను : హిందువులు భగవానుని విగ్రహరూపంలో పూజిస్తారు. అల్లాగే ఇతర మతస్థులూనూ. విగ్రహారాధకులే.

ఉదా : కాబాలో 'నల్లరాయిని' ముస్లింలు ముద్దాడుతారు. లేక నడివీధిలోని రాయిని ముద్దిడతారా?

శ్రీనగర్‌లో హజరత్‌బాల్ (ప్రాఫెట్ పవిత్ర కేశం)ను పవిత్రంగా ఆరాధిస్తాడు. ఇతర వెంట్రుక ముక్క యెడ అలాంటి భావం కనబరుస్తారా?

(పీర్) సంత్ ముస్లిం సమాధులను ముస్లింలంతా ఆరాధిస్తారు. అంతెందుకు? ప్రతాపఃఘర్‌లో అఫ్జుల్‌ఖాన్ సమాధి దర్గాగా మార్చబడి ముస్లింలు ఆరాధిస్తున్నారు. అఫ్జుల్‌ఖాన్ 'పీర్' గాని 'ఆలియు' గాని కానేకాడు. (శివాజీని వశపరచుకోడానికి వెళ్ళేముందు తన 64 మంది ఉంపుడుగత్తెలను మరెవరూ ముట్టకుండా వుండుటకై జలసమాధి చేయమన్నాడా అఫ్జుల్‌ఖాన్) అజ్మీర్‌లో 'క్వాజా ఘరీబ్‌నవాజ్ రహిమ్‌తుల్లా' దర్గాను ఆరాధిస్తున్నారు. విగ్రహాలు, సమాధులు టూంబ్స్‌కు మ్రొక్కడం ముస్లిం వ్యతిరేకమైతే ముస్లిం మతాధిపతులు వాటినెందుకు పడగొట్టమని అజ్ఞలివ్వలేదు. డెమాస్కస్ నగరం వెలుపల మహమ్మద్ మనుమరాలైన అల్.సిట్. జైనబ్ గోరీని భక్తి శ్రద్ధలతో ఎందుకు పుజిస్తున్నారు? అవన్నీ విగ్రహారాధన కాదా?

– ఈమని సువర్ణం, ఎమ్. ఎ.

మన పూర్వీకులు తమకు ఉత్తమ గతులు కలుగుతాయని దేవాలయాలు స్థాపించి, వాటినిర్వహణకు సమృద్ధిగా ఆస్తిపాస్తులను ఇచ్చినారు. విచారకరమేమిటంటే, స్వాతంత్ర్య భారతంలో, ధర్మ సంస్థలు వీరి ఆశయాలకు దూరమై, అనేక చోట్ల కోర్టుల, రాజకీయాల, నాస్తికుల పాలై మరియు పారిశ్రామిక రంగంలోలాగున, అలజడుల తదితర ఉద్యమాల పాలై, హిందూధర్మం అవహేళన పాలు అగుచున్నది. ఇవి కేవలంగా హిందూ ధర్మ సంస్థలలోనే జరుగుచున్నది. మిగతాచోట్ల కాదు. మన పూర్వీకులు ''జీతం'' అనే పదం వాడలేదు. పారితోషికం అన్నారు. ధర్మ సంస్థల నిర్వాహకులు భోగభాగ్యాల కోసం తాపత్రయ పడలేదు. నిష్ఠాగరిష్ఠులై ఆలయాలను, ధర్మాన్ని రక్షించుకుంటు వచ్చారు. అందు చేతనే ఆలయాలు మహిమలతో విరాజిల్లుతూ వచ్చాయి. సత్రములు అన్నపూర్ణ నిలయాలుగా సమాజశ్రేయస్సుకు దోహదం అయ్యేవి. ఇప్పుడు అర్చకులు నుండి కూడా, తమ కోరికలు తీర్చకపోతే, ఆలయాలలో పూజలకు అవాంతరాలు కలుగబోతాయనే మాటలు వస్తున్నాయి. ఇదివరలో ఇట్లు ఏప్పుడూ హిందూ దేశచరిత్రలో జరుగలేదు.

**2**. ధర్మ సంస్థలు తప్పుడు బాటలో పడ్డాయి. మన రాజకీయ నాయకులు అన్నిచోట్లా కలుగ చేసుకుంటున్నారు. ఇది ఊహించి ఉంటే, దాతలు ధర్మ సంస్థలకు ఆస్తిపాస్తులను ఇచ్చేవారు కాదు. నిర్వహణలో త్యాగభావం, భక్తి ప్రపత్తులు, నిస్వార్థం లోపించుట చేతనే, ఇప్పుడు ధర్మ సంస్థలకు ఒక సెంటు భూమి ఐనా ఇచ్చే దాతలు కానరారు. సమాజశ్రేయస్సు కున్న ధర్మ సంస్థలు, వ్యక్తిగత రాజకీయ స్వార్థాలకు బలైపోతున్నాయి. మననాయకులే మన ధర్మానికి ఘాత చేస్తున్నారు.

**3**. లౌకిక శాసనాల ఉచ్చులో పడ్డ ధర్మ సంస్థలు మూతపడిపోకుండ ఉండాలంటే, ఈ క్రింది మార్గలే శరణ్యం :

**1**. ధర్మసంస్థలను, ఆస్తిపాస్తులను లౌకిక శాసనాలనుండి మినహాయించి, ధర్మపరంగా వేరే ప్రత్యేక చట్టాలను రూపొందించాలి.

**2**. హర్తాళులు, కోర్టులావాదేవీలు, రాజకీయాలు, నాస్తికుల నాయకత్వాలు ధర్మ సంస్థలలో ఉండరాదు. జీతం అనే పదానికి బదులు, పారితోషికం అనే పదం వాడాలి. పెద్ద పోష్టులకు ఐ. ఎ. ఎస్. ఆఫీసర్లను కమిషనర్లుగా నియమించాలి. వీరు ధర్మసంస్థలకు డెపుటేషన్ పై సంపూర్ణ అధికారాలలో వచ్చెదరు.

**3**. నిర్వహణకు, దాతల, వారి వంశీయుల, భక్తుల, అనుభవజ్ఞుల, హిందూధర్మ సంస్థల పీఠాల ప్రతినిధులు, పండితులు, న్యా య మూర్తులతో, అధికార, అనధికార సమ్మేళనతో ధార్మిక మండలులను నియమించి. నిర్వహణ వీరికే వదిలి వేయాలి. ఇందువల్ల ప్రభుత్వపు కార్య భారం తగ్గును. ప్రభుత్వ సహకారం అవసరమే. పెత్తనం కాదు.

భావంతో ఎన్నో మంచి పనులు చేస్తున్నాయి. చర్చిలవారు ఎట్టి అలజడులు లేవదీయుటలేదే! ఒకే మాటపై సఖ్యతతో పనిచేయుచున్నారే! మననాయకులకు హిందూ ధర్మ సంస్థలు చులకన, రాజకీయనాయకులు ధర్మ సంస్థల నుండి ఉప సంహరించు కోకపోతే, ఇవి భ్రష్టుకాక తప్పదు. ఇప్పటికీ ఎంతగానో నష్టపోయాయి. సఖ్యతకి బదులు, అంతర్ కలహాలు సృష్టిస్తున్నారు. రాజకీయనాయకులు లేక పోతే, హిందూ సమాజం హిందూ ధర్మాన్ని, ధర్మ సంస్థలను రక్షించుకో లేదా? ఎండోమెంటు వారు తమకున్న సదుపాయాలను కొనసాగించు కోవచ్చు. మున్ముందు కొత్తవారికి ఎండోమెంటులోపై పద్ధతులు వర్తింపచేయాలి. ఇందులకు హిందూ సమాజంలో ఎందరో ముందుకు వచ్చెదరు.

5. మన నాయకులకు ధర్మ సంస్థలు కుంటు బడేవరుకూ ఊరు కోనక్కరలేదు. ఈ లోపునే తగు చర్యలు తీసుకోవాలి. జాప్యం చేస్తే, వట్టి పోయిన అవును సమాజానికి వదలి వేసి నట్లగును. పాలకులు పరిపాలనాదక్షులై ఉండాలి. ప్రతి చోటా లొంగిపోతే ఇక పరిపాలన ఎక్కడా? ఏది సవ్యమో అది చేయాలి – నిక్కచ్చిగా, నిర్మొహమాటంగా.

## హాజ్ కారణంగా 300 కోట్ల రూపాయలు నష్టం !

కేంద్రీయ – మంత్రి ఆదేశం ప్రకారంగా ఈ సంవత్సరం కూడా ఏర్ ఇండియా తరపున నాలుగు విమానాలు హాజ్ యాత్రికుల సౌకర్యం కొరకు వాడుతున్నారు. పక్షపాత చర్య వలన ఏర్ ఇండియాకు ఈ సంవత్సరం **300** కోట్ల నష్టం కలగ వచ్చు. **1995 – 96** లో ఇలాంటి తప్పు వల్ల హాజ్. యాత్ర వలన ఏర్ ఇండియాకు **271** కోట్ల నష్టం కలిగింది.

కేంద్రీయ ప్రభుత్వం హాజ్ యాత్రికులకు విమాన కిరాయిలో **40** శాతం తగ్గింపు ఇస్తుంది. ప్రపంచంలో ఏ ముస్లిం జాతిలో కూడా ఇంత పెద్ద తగ్గింపు లేదు. పాకిస్తాన్ లో ఉన్న తీర్థక్షేత్రాలకు మరియు కైలాస మానససరోవర్ వెళ్ళే హిందూ యాత్రికులకు మన ప్రభుత్వం ఎలాంటి సహాయం, సౌకర్యాలు. ఇవ్వదు. ఇది గమనించ వలసిన విషయము. (మీ.ఫో)

## జీవిత సభ్యులు

శ్రీ చుండూరు మల్లిఖార్జునయ్య
కొత్తపల్లి (post) మాచర్ల (మం)
గుంటూరు (జి) – 522426

శ్రీ విశ్వేశ్వర క్లాథ్ ఎంపోరియం.
మాచర్ల (పోస్టు)
గుంటూరు (జిల్లా) – 522 426

శ్రీ కె. ఉమామహేశ్వరుడు
23-6-35, ఉమాచిట్‌ఫండ్స్, కంపెని,
సత్యనారాయణ పురం, విజయవాడ – 11



# ఛాందోగ్యోపనిషత్ కాంతులు

సత్యకామ జాబాలి గురువుగావించిన ఉపనయన సంస్కారంచే బ్రహ్మచర్యవ్రత ధారియై గురువును సేవిస్తూ ఉన్నాడు.

సరళహృదయుడు సత్యవాదియైన సత్యకాముని ప్రతిభను ద్విగుణీకృతం చేయుటకు గురువు **400** గోవులనిచ్చి వెయ్యి గోవులగు వరకు అరణ్యంలో నివసిస్తూ గోసేవ చేయమని ఆజ్ఞాపించాడు.

వెంటనే సత్యకాముడు గురువు ఆజ్ఞను శిరసావహించి గురువు ఆశీర్వాదాన్ని పొంది గోవులను తోలుకొని అరణ్యానికి వెళ్ళాడు. గడ్డి ఏపుగా సమృద్ధిగా ఉండి నిర్మల మధుర జలాలతో నిండిన సరోవరాలు ఎన్నుకొన్నాడు. ప్రతిదినం యధావిధిగా నిత్యానుష్ఠానాదులను పూర్తి చేసుకొంటూ గోవులకు తగిన సమయాలలో మేతను, నీటిని సమకూరుస్తూ గోసేవలోనే కాలం గడుపుతున్నాడు. ఇలా రోజులు, వారాలు, పక్షాలు, నెలలు, సంవత్సరాలు గడిచిపోయాయి. గోవుల సంఖ్యయందు దృష్టిలేక గోసేవే ప్రధానంగా తలచి దానిలోనే లీనమై పోయాడు. నిరంతరం గురుధ్యానం చేస్తూ త్రికరణశుద్ధిగా గోవుల పాలన పోషణాది కృత్యాలు ఆచరిస్తూ కాలం గడుపుతున్నాడు. ఇలా సేవిస్తూ ఉండగానే గోవుల సంఖ్య సహస్రాధికం అయినది. అయినా దానియందు అతనికి ఆలోచన లేదు. గురుధ్యానం గోసేవలే ప్రధానలక్ష్యం.

ఒకనాడు సత్యకాముడు ప్రాతఃకాలంలో సూర్యునకు అర్ఘ్యం ఇస్తున్న సమయంలో ''సత్యకామా'' అని తన్ను పిలిచినట్లై వెనుదిరిగి చూడగా ఆలమందనుండి ఒక వృషభం నిలబడి ఉంది సత్యకాముని చూడగానే వాయురూపమైన ఆ వృషభం ఇలా అంది. ''సత్యకామా! మా సంతతి వేయిని మించింది. ఇక నీవు మమ్ములను గురువు ఆశ్రమానికి తీసుకొని వెళ్ళు. అవిచ్ఛిన్నమైన సేవాభావంతో నీవు బ్రహ్మజ్ఞానానికి అర్హుడవయ్యావు. బ్రహ్మజ్ఞానం ఒక్క ఒక పాదం ఉపదేశిస్తానని చెప్పింది.''

సత్యకాముడు సమ్మతించగానే నాయనా! తూర్పుదిక్కు, పడమటి దిక్కు, ఉత్తరదిక్కు, దక్షిణదిక్కు అనే అవయవాలు బ్రహ్మకు ఒక పాదం అవుతాయి. బుధులు దీన్ని ''ప్రకాశవాన్'' అంటారు. దీన్ని నిరంతరం ఉపాసించు. తర్వాత పాదాన్ని అగ్ని నీకు ఉపదేశం చేస్తాడని చెప్పి మందలో కలిసిపోయింది. దాన్ని విన్న సత్యకాముని హృదయం ఆనంద తరంగితం అయింది.

మరునాడు ఉదయం గోవులను తోలుకొని గురుకులానికి ప్రయాణమైనాడు. సాయంకాలం ఒక సరస్సు దగ్గర ఆగి పశువులకు మేత, నీళ్ళు త్రాగించితాను శుద్ధుడై అగ్నిని ప్రజ్వలింపజేసి ఎదురుగా తూర్పు ముఖంగా కూర్చున్నాడు. అగ్ని బ్రహ్మయొక్క రెండవ పాదాన్ని ఇలా అతనికి చెప్పడం ప్రారంభించాడు.

భూమి, ఆకాశం, స్వర్గలోకం, సముద్రం అనే అవయవాలు బ్రహ్మకు రెండవ పాదము, దీనికి ''అనంతవాన్'' అని పేరు. దీన్ని ఉపాసించిన వాడు అనంతుడవుతాడు. ఇక నీకు మూడవ పాదాన్ని హంస ఉపదేశిస్తుందని చెప్పాడు. దీనితో సత్యకాముని లౌకిక వాంఛలు నశించాయి. దీనినే రాత్రంతా మననం చేస్తూ గడిపాడు.

మరల గోవులను జలతృణాదులతో సేవించి ఉదయాన్నే బయలుదేరి సంధ్యాసమయానికి నిర్మలమైన ఒక సరోవరం చేరాడు. అచట అతడు గోవులకు పరిచర్యలు చేసి అగ్నిని ప్రజ్వలించి దానికెదురుగా కూర్చున్నాడు.

ఇంతలో సూర్యరూపమైన ఒక హంస పూర్వదిశనుండి వచ్చి ఇలా చెప్పింది. ''సత్యకామా''! అగ్ని, సూర్యుడు, చంద్రుడు, విద్యుత్తు ఈ నాలుగు బ్రహ్మయొక్క మూడవ పాదానికి అవయవాలు. దీనికి ''జ్యోతిష్మాన్'' అని పేరు. దీనిని ఉపాసించువాడు జ్యోతిష్మంతుడవుతాడు. దీనినుపాసించు అని చెప్పి వెనుదిరిగి వెళ్ళి పోయింది. ఆ రాత్రి అతడు దీనిని మననం చేసుకొంటూ జ్యోతిష్మంతుడు అయ్యాడు.

మరల మరునాడు ఉదయం బయలుదేరి సాయంకాలానికి ఒక మఱ్ఱిచెట్టు వద్దకు చేరాడు. గోవులను జలతృణాదులచే సేవించి ఆ చెట్టు క్రింద వాటిని విశ్రమింప జేసి తాను అగ్నిని ప్రజ్వలింప జేసి ఎదురుగా ఉపవిష్టుడైనాడు.

ఇంతలో ఒక నీటికోడి వచ్చి వత్సా! నీకు వాయురూపధారి వృషభము, సాక్షాత్తుగా అగ్ని దేవుడు, హంసరూపాన్ని ధరించిన సూర్యుడు, నీకు బ్రహ్మ యొక్క మూడుపాదాలను ఉపదేశించారు. నేను నాలుగవ పాదాన్ని ఉపదేశిస్తున్నాను. వత్సా! ప్రాణం, నేత్రం (కన్ను), శ్రోత్రం (చెవి) మనస్సు ఇవి బ్రహ్మయొక్క నాలుగవ పాదానికి అవయవాలు. దీన్ని ''ఆయతనవాన్'' అంటారు. దీన్ని ఉపాసించినవాడు అధారంగలవాడవుతాడు. అని ఉపదేశించి వెళ్ళి పోయింది.

ఆరాత్రంతా దీనినే మననం చేయగా బ్రహ్మం సర్వవ్యాపకం అని, ఆ బ్రహ్మాన్ని ఉపాసించిన మానవులు తనలోనే దాన్ని చూడగలడని తెలిసికొన్నాడు. ఆతని ముఖం బ్రహ్మతేజస్సుతో వెలిగిపోయింది. హృదయం ఆనందసాగరంలో మునిగిపోయింది.

మరునాటి ఉదయాన బయలుదేరి గురుకులానికి చేరి గురువుకు గోవులనప్పగించి ప్రణమిల్లాడు. గోసేవలో ఆతని ధృఢవ్రతం, కార్యదీక్ష, గురుభక్తి, నిష్కామకర్మ, సేవారక్తి, గురువును పరవశింపజేసాయి. ఆతని బ్రహ్మవర్చస్సుచే వెలుగొందే ముఖం చూడగానే ప్రసన్నత కలిగింది.

సత్యకాముడు దారిలో తనకు కలిగిన అనుభూతులు గురువునకు విన్నవించి అయ్యా ! నేను బ్రహ్మజ్ఞానం పొందినా. ఆచార్యుని ఉపదేశం చేతనే అది సిద్ధిని పొందుతుంది. కాబట్టి మీరు నాకీ బ్రహ్మజ్ఞానాన్ని ఉపదేశించి అనుగ్రహించి ఆశీర్వదించండని వేడుకొన్నాడు. నీవు పొందిన బ్రహ్మజ్ఞానాన్ని మించిన దీ ప్రపంచంలో లేదు. గోసేవ చేతనే నీకు బ్రహ్మజ్ఞాన సిద్ధికలిగింది. ఇదంతా గోసేవాఫలమే. అని వృషభాదులు చెప్పిన విషయాన్నే సత్యకామునకు ఉపదేశించాడు.

ఇట మనం గ్రహించవలసిన విషయం చాలా ముఖ్యమైనది. భారతీయులు గోసేవా నిరతులు. కాని ఈనాడు గోసంతతికి జరిగే అన్యాయాలను చూస్తున్నాం కదా! అందు చేతనే భారతీయులు అనేక సమస్యలతో బాధాపూరితులై అనంతములైన కడగండ్ల పాలవుతున్నారు. గోసేవలోనే బ్రహ్మజ్ఞాన సిద్ధి కలుగుతుంది. అనే భావముతో ఈనాడు గోసంతతిని రక్షించుకొని వాటి సేవాభాగ్యంచే బ్రహ్మజ్ఞాన సంపన్నం కావలసిన అవసరం ఎంతైనా ఉంది.

దిలీపుడు గోసేవా భాగ్యం చేతనే సంతతి పొందాడని, శ్రీకృష్ణుడు గోసేవతో గోధూళిధూసరిత శరీరుడై అధర్మాన్ని నశింపజేసి ధర్మ ప్రతిష్ఠాపన చేసాడని మనం చెప్పుకొంటూనే ఉంటాం. కాన పుణ్యభూమి, కర్మభూమియైన భారతదేశంలో గోసేవను గుర్తించే విధానం చేయవలసిన పవిత్ర బాధ్యతను స్వీకరిద్దామా !

– సేకరణ : శ్రీ ఉపద్రష్ట వేంకటకృష్ణయ్య

# ఆదిత్యహృదయం

(గతసంచిక తరువాయి) — అల్లూరి వేంకటనరసింహరాజు

ఆదిత్య హృదయం, మనలోని కామక్రోధాది అనంత శత్రువులను, మనకు అపకారం తలపెట్టే బహిః శత్రువులను, నశింప జేస్తుంది. చింతా శోకాలను నిర్మూలిస్తుంది.

విభీషణుని భార్యయైన 'సరమ' సలహా మేరకు, సీత ఆదిత్య హృదయాన్ని ఉపాసించి, చింతను పోగొట్టుకొంది. అగస్త్యుని ఉపదేశం మేరకు, రాముడు జపించి శోకాన్ని అధిగమించాడు.

సంపదను కాంక్షించేవారు, సూర్యోపాసన చెయ్యాలి. సత్రాజిత్తు అలాచేసి, శ్యమంతకమణిని సంపాదించాడు. సంతానాన్ని అపేక్షించేవారు, సూర్యోపాసన చెయ్యాలి. కుంతీదేవి ఆ విధంగా చేసి, కర్ణుని పుత్రునిగా పొందింది. ఆరోగ్యం కావలసిన వారు, సూర్యుని ఆరాధించాలి. పౌరాణికంగా సాంబుడు దుర్వాసుని శాపం వల్ల కుష్ఠువ్యాధిగ్రస్తుడై, సూర్యుని ఆరాధించి, రోగ విముక్తుడయ్యాడు. చారిత్రకంగా మయూరభట్టు, సూర్య శతకాన్ని వ్రాసి కుష్ఠు వ్యాధి నిర్మూలించుకొన్నాడు. జయం కావలసిన వారు ఆదిత్యుని అనుగ్రహం పొందాలి. శ్రీ రాముడు అలా చేసి రావణుని జయించాడు.

సూర్యుడు హరిదశ్వుడు. 'హరిత్' అంటే మనస్సును హరించేవాడు అని అర్థం. సూర్యుడు, కిరణమే అశ్వంగా కలవాడు. అతని కున్నది ఒకే ఒక్క అశ్వం. దాని పేరు 'సప్త' అదే యేడుగా పరిణమించి, 'సప్త సప్తి' అనిపించుకొంటున్నది. అంటే ఒక్క తెల్లని కిరణమే, సప్తవర్ణాలుగా రూపొందుతుందని ధ్వని! ఇది విజ్ఞాన శాస్త్రరీత్యా ఋజువైంది. సూర్యునిలోని ఎనిమిదవ కిరణానికి 'కశ్యప' అని పేరు. దానినే త్రిప్పి చదివితే 'పశ్యక' ఔతుంది. అదే యీ సర్వ సృష్టికి కారణ భూతమట. కనుక అదే స్రష్ట అదే ద్రష్ట!

మాఘమాసం, సూర్యారాధనకు అనువైన కాలం. మంత్రోపదేశానికి గాని మంత్ర జపానికి గాని, తగిన తిథి అమావాస్య, లేదా గ్రహణకాలం. అమావాస్యనాడు, సూర్యుడు సర్వ దేవతాస్వరూపుడై యుంటాడు.

ఆదిత్యునికి ఆదివారం ప్రీతికరమైన రోజు. కనుక, ఆనాడు నూనెతో తలంటు పోసుకోకూడదు. ఉసిరిక, మద్యం, మాంసం, స్త్రీ సేవన పనికి రాదు.

'వైద్యో నారాయణో హరిః' అన్నది ఆర్యోక్తి, ఆదిత్యుని సూర్యనారాయణుడంటాము. అంటే ఆయన ఒక దివ్యవైద్యుడన్న మాట, దైవమే వైద్యుడు. అమృతమే, ఔషధము. మంత్రమే ఔషధ నిర్మాణ శాస్త్రము.

ఆదిత్యుని దైవంగా విశ్వసించిన వారు, విశ్వసించనివారు కూడా, ప్రకృతి చికిత్స ద్వారా సూర్యకిరణాల వల్ల ఆరోగ్యవంతు లౌతున్నారు. ప్రాతఃకాలాన స్నానం చేసి, సూర్య భగవానునికి అర్ఘ్యం యివ్వాలన్నది విధి. మనం ఏదైనా జలాశయంలో స్నానంచేసి, సూర్యునికెదురుగా నిలబడి, అర్ఘ్యమిచ్చినట్లైతే, ఆ జలధారమీదుగా ప్రసరించే సూర్యకిరణాల ప్రభావం, మన దేహంపై పడి, శరీరంలోనున్న దుష్టక్రిములు నశిస్తాయి. ప్రాణ శక్తి వృద్ధి చెందుతుంది.

పాండు రోగము, హృదయరోగము కలవారు సూర్యోదయకాలంలో ఎఱ్ఱని కిరణాలను సేవిస్తే రోగ నివారణ అవుతుందని పెద్దలు చెబుతారు. ఎఱుపు రంగు సూర్యకిరణాలను సేవిస్తూ, ఎఱ్ఱని ఆవుపాలు త్రాగితే, ఆయుష్షు, రూపము, ఆరోగ్యము వృద్ధి చెందుతాయని అథర్వణ వేదం చెబుతున్నది. (సశేషం)

# ఆది నుండి ఆధునికం వరకు - స్త్రీ

(గతసంచిక తరువాయి) - డి. జి. విజయలక్ష్మి

ఇక వివాహ విషయంలో ఎంత శ్రద్ధ కనపర్చారో చూడండి! కామమామరణాత్తిష్ఠేత్ గృహే కన్యర్తుమత్యపి।

నచైవైనాం ప్రయచ్ఛేతు గుణహీనాయ కర్హిచిత్॥
9 అధ్యాయంలో 19వ శ్లో॥

అంటే యుక్తవయస్సు వచ్చిన కన్యను యోగ్యతకు తగిన వరునికిచ్చి వివాహం చెయ్యాలి. తగిన వరుడు దొరకకపోతే మరణపర్యంతం తండ్రి ఇంటవున్నా ఉచితమే కాని గుణహీనుడు, అయోగ్యునకిచ్చి ఆమెను కష్టపడన్వికూడదు అని అర్థం. మనువు కాలంలో స్త్రీలెంత అదృష్టవంతులు! గుణవంతులైన వరులకోసం ఎంత కాలమైనా నిరీక్షించవచ్చు. అభ్యంతర పెట్టేవారు, ఆడిపోసుకునేవారు లేరానాడు. సప్తవ్యసనాల్లో ఏ ఒకటైనా లేనివారు దొరకటం దుర్లభమీనాడు. ఒకవేళ నూటికొకడు దొరికినా వాడడిగే కట్న కానుకలివ్వలేక పోవటమో మైనస్ పాయింటు. ఈ మధ్య మరీ చదువుకున్న అమ్మాయిలే కావాలని డిమాండు. ఉద్యోగిలైతే కట్నంలో డిస్కౌంటని సడలింపు. ఈ చదువులయ్యేసరికి వయస్సు రెండుపదులు దాటితే, ఉద్యోగం వచ్చేసరికి, పాతిక దాటితే, ఇంకా పెళ్లికాలేదనీ కాల్చుకుతినే బంధువులకు భయపడి, త్వరగా పెళ్లి చెయ్యాలనీ ఆరాటంలో చదువులోను, గుణంల్లో అమ్మాయి కంటే తక్కువ వాడైనా ఫరవాలేదు. పెళ్లైతే వాడేకుదురుగా వుంటాడంటూ ముడిపెట్టేసారు తప్ప అమ్మాయి ఇష్టానికి, వరుని గుణాలకు ప్రాధాన్యత నిచ్చేవారే కరువైనారు. నిజంగా వారితో పోల్చుకుంటే ఈ నాటి కన్యలస్వతంత్రులేనని చెప్పకతప్పదు. స్త్రీలకనుకూలంగా ఎన్నో నియమాలు చెప్పిన మనువును స్త్రీ విముక్తి వాదులు దూషించటం, ద్వేషించటం మనకు తెల్సు కారణం స్వజాత్యభిమానంతో, స్త్రీలను కించపర్చాడని, స్త్రీలంటే తమ చెప్పుచేతల్లో వుండి, పిల్లల్ని కనేయంత్రాలుగా భావించే అహంకార పూరిత పురుషజాతికి ప్రతినిధియని, స్త్రీకి స్వాతంత్ర్యం వుండకూడదన్నాడని వేదికలెక్కివాదించే వారందరూ ఒక్కసారి మనుధర్మ శాస్త్రాన్ని చదువగల్గితే, ఆశ్లోకార్థాన్ని సాలోచనగా పరికిస్తే అలా అని వుండరు. మహర్షి మనువు స్త్రీ విద్యా విషయంలో, వివాహవిషయంలో, ఆస్తి హక్కుల విషయంలో, ఎంతో ఉదారత చూపి, సమాజంలో ఆమెకు గౌరవస్థానముండాలని ఆదేశించి, ఆమె సామర్థ్యాని ప్రశంసించిన మనువు ఈమాట ఎందుకన్నారు అని యోచించేవారెందరు? అసలెందుకు చెప్పారు? ఏ సందర్భంలో చెప్పారు? అప్పటి సామాజిక స్థితిగతులేమిటి? అని విచారించకుండా విమర్శించటం అంధగజన్యాయసదృశమౌతుంది. ఎలాగంటే – నల్గురు గుడ్డివాళ్లు ఏనుగెలా వుంటుందో తెల్సుకోవాలనుకున్నారుట. వారి మిత్రుడు వాళ్లను ఏనుగు సమీపానికి తీసుకువెళ్లాడు. ఒకడు దాని తొండం పట్టుకొని 'అజగరమివాస్తి' అన్నాట్ట. మరొకడు చేటలంత చెవులు పట్టుకొని 'శూర్పాకారో గజః' అన్నాట్ట. ఇంకొకడు కాళ్లు తడిమిచూసి 'స్తంభాకారో గజః' అని నిర్ధారించాట్ట. వేరొకడు తోకను పట్టుకుని 'సర్పాకారో గజః' అన్నాట్ట. అన్నిరకాల పోలికలు ఏనుగలోవున్నాయెమోకాని ఏనుగు ఆకారం మాత్రం ఏ

ఒక్కరు చెప్పినదీ కాదు. అలాగే ఇక్కడ రకరకాల వాఖ్యానాలు చేస్తున్నారు కాని నిజాన్ని స్పృశించ టంలేదు. ''నస్త్రీ స్వాతంత్ర మర్హతి'' అన్న మహర్షిమాటకు స్త్రీ తన రక్షణ విషయంలో స్వతంత్రం తగదు అనిభావం. అయితే ఈ వాక్యంలో రక్షణ అన్న పదమే లేదే అని సందేహమొస్తుంది మనకు. ఈ శ్లోకంలోని పై పాదాలను మదించినట్లైతే కన్పిస్తుంది–

పితారక్షతి కౌమారే, భర్తా రక్షతి యౌవనే।
రక్షంతి స్థవిరే పుత్రాః, నస్త్రీ స్వాతంత్రమర్హతి॥
అనే శ్లోకం 9 అధ్యాయంలోని 3వది.

బాల్యంలో తండ్రి, యౌవ్వనములో భర్త, వృద్ధాప్యంలో పుత్రులు. ఆమె రక్షణా భారం వహించాలని, ఆమె తన రక్షణవిషయంలో స్వతంత్రించతగదని భావం–.

అయితే అదే అధ్యాయంలో 12వ శ్లోకంలో

''ఆత్మానమాత్మనా యాస్తు రక్షేయుఃతాః సురక్షతాః'' అన్నారు. అంటే ఏస్త్రీలైతే తమనుతాము రక్షించుకొనగలరో వారు సురక్షితులుగా వుందురు అనిభావం. స్త్రీలు తమరక్షణ విషయంలో తమంత తామే జాగ్రత్త పడాలనే హితము, హెచ్చరిక కూడ ధ్వనిస్తోందిక్కడ. ఏమిటీ పొంతనలేని మాటలన్పిస్తుంది మనకు. కాని నిశితంగా గమనించినట్లైతే ఎంతో దూరదృష్టితో చెప్పారాని ఆశ్చర్యం కల్గకమానదు. ఒక్కొక్క స్టేజిలో ఒక్కొక్కరు రక్షిస్తారు అని చెప్పారు. తర్వాతేమో మీరు పరాధీనలు కారాదు. ఆత్మానం ఆత్మనా రక్షేయుః అన్నారు. ఆత్మనాః తమచేత; ఆత్మానం– తమ్ముతాము రక్షేయుః – రక్షించుకొందురు (లేక) రక్షించుకొనవలెను అని అర్థం. రక్షేయుః అనేది విధిలిజ్ క్రియాపదం. ఇందులో ఆజ్ఞ, ఆదేశార్థం వుంది. మరి మనం పైశ్లోకంలో 'పితా రక్షతి కౌమారే అనే మొదటిపాదానికి తండ్రి టీనేజ్ వరకు (కౌమారదశ) రక్షించుచున్నాడు అని అర్థం. అంతేకాని రక్షించవలెను, ఆమెస్వతంత్రించకూడదనే విధి ప్రయోగం చెప్పబడలేదు. అదే ఆయన ఉద్దేశ్యమైతే 'రక్షేత్' అని లిఖించేవాడా శ్లోకాన్ని. అలాగే మూడవ పాదంలో రక్షంతి స్థవిరే పుత్రాః' అనగా ముసలితనంలో పుత్రులు రక్షించుచున్నారని అర్థం. అంటే చిన్నప్పుడు 'ఆడపిల్లల్ని రక్షించటమే తండ్రిబాధ్యత' మగపిల్లల్నిగాలికొదిలెయొచ్చని అర్థమా? ముసలితనంలో కొడుకులు తల్లిని మాత్రమే రక్షించితండ్రిని తరిమేయ్యాలనేది మహర్షి ఉద్దేశ్యమనుకుంటామా? బాల్యంలో తండ్రి రక్షణలో తల్లిపోషణలో పిల్లలు, ముసలితనంలో పిల్లల రక్షణలో తల్లిదండ్రులు వుండటం సహజం. ఈ రక్షణ స్త్రీ జాతికే చెందినదికాదని, పురుషులకు కూడ తప్పని సరియన్నది మనమంగీకరించాల్సిన సత్యం. ఇక 'భర్తా రక్షతి యౌవ్వనే' అనేపాదం కేవలం స్త్రీల కొరకు చెప్పినదే! యువావస్థలో విషయవాంఛాసక్తి ఎక్కువగా వుంటుంది. అందు, ఆకర్షణ స్త్రీలకొకవిధంగా శత్రువులు. ప్రకృతిసిద్ధమైన ఐహిక వాంఛలను, ఆడువారి శారీరిక దుర్బలత్వాన్ని, నాటి సమాజస్థితి దృష్ట్యా మనువలా ప్రవచించివుంటారు. ధనప్రాణాలకన్న మిన్నగా శీలానికి ప్రాధాన్యతనిచ్చే సుసంస్కృతి మనది. స్వశక్తితోబాటు యస్కార్టు అవసరమని భావించారు మనువు. ఈవేళ ఉన్నత పదవుల్లోవున్నవారికి. ఇటునటు రక్షకభటులు వెన్నంటి వుండటం మనం చూస్తున్నాం. అంటే అంత అధికారంలోకి రాగల సామర్థ్యముందా? ఆత్మరక్షణకు ఆయుధాలు చాలవా అనికాదు. వారికి గౌరవసూచికంగా రక్షణ ఏర్పాట్లు అంతే! అందరికన్న వారి

మదుంటుందికనుక డేగ కళ్లతో కాపలా కాస్తూ సాయుధులిరుప్రక్కల వుంటారు. అలాటి రక్షణ స్త్రీకి కూడ అవసరమని మహర్షి భావన అంతేకాదు – ఈనాడు స్త్రీలు ఎక్కడికైనా వెళ్లాలంటే విమానాలైతే గంటల్లోనూ, బస్సులు, రైళ్లలో ఒపూటలోనూ గమ్యం చేరుకోవచ్చు. రిజర్వేషన్ చేయించుకుంటే నిద్రపోతూ నిశ్చింతగా ప్రయాణం చేయగలరు. ఎక్కడైనా ఇబ్బందులెదురైతే ఇంటికో ఫోన్ కొడితే తనవాళ్లు పరుగెత్తు కొస్తారనే ధైర్యం వుంది. ప్రమాదాలెదురైతే ఎక్కడిక్కక్కడె పోలీసు స్టేషన్లున్నాయ్. రక్షణ కోరవచ్చు ఇన్ని వసతులున్నాకూడ మానవతుల మానభంగాలకు కొదువలేదు. ఒంటరిగా అర్ధరాత్రి ఆడది నిర్భీతిగ తిరిగిరాగల్గిననాడు నిజమైన స్వతంత్రం వచ్చినట్లన్నాట్ట మహాత్ముడు, పట్టపగలు తిరిగి రాగలదా! అర్ధరాత్రివెళ్లే అసలుంటుందా! అని సందేహించేస్థితిలో వున్నాం. భర్తప్రక్కన కూర్చుని వెళ్తున్న స్త్రీలనుకూడ, వాడినికొట్టి, ఆమెను కొట్టేశివ సంఘటనలు కోకొల్లలు. మరి ఆనాడింతటి శీఘ్ర ప్రవహణసాధనాలు, ప్రసారోపకరణాలు లేవు. రథాలు, గుర్రాలలో ప్రయాణాలుండేవని చరిత్ర చెప్తోంది. పైగా ఇంత జనాభాలేదు. నిర్జన స్థలాలెక్కువ. మరి అలాంటపుడు యౌవనవతియైన భార్యను భర్త రక్షించుచున్నాడనటం స్త్రీ ఔచిత్య భంగమా? స్త్రీ అస్వతంత్రగా బానిసగా బ్రతికినట్లు భావించుటుచితమా? పురుషుడు రక్షించుచున్నాడంటే పురుషాధిక్యతను ప్రాధాన్యత నిచ్చాడంటామా! స్త్రీ స్వేచ్ఛ గురించి ఎలుగెత్తే స్వేచ్ఛావాదులు తమతోబుట్టువుల్నో, భర్తనో, తోడులేకుండా ఒంటరిగా తిరిగిరాగలస్థితి నేడుందా సమాజంలో. కనుక భౌతిక పరమైన రక్షణ స్త్రీకి ఎప్పుడూ అవసరమే. ఆరక్షకుడు, తండ్రి కావచ్చు తనయుడు కావచ్చు. సేవకుడు కావచ్చు. ఇదీ మన పరిస్థితి కాని మనువు అలా భావించవలేదు. ''భర్తా రక్షేత్‌యౌవనే'' అన్నివుంటే మనం నిరసించవలసిందే! ఈ ఈదశల్లో వీరు రక్షించుచున్నారు. ఆమె స్వతంత్రించనక్కరలేదని చెప్పారాయన. రక్షణ అంటే ఇంట్లో కట్టిపడేసి తిండి బట్ట ఇచ్చి పోషించటమనికాదు. స్వ=తననుగురించి తాను తంత్రం=యోచను తనరక్షణ, విషయంలో తాను స్వతంత్రించనవసరం లేదంటూనే ఆత్మానం ఆత్మనం అంటూ స్వయంసిద్ధవు కమ్మన్నారు. పైగా విద్యావంతుల శాతం తక్కువ కనుక ఆర్థికపరంగా కూడ వారి కనుకూలమైన అంశలు చెప్పారు.

భార్యకు తెలియకుండా స్థిరాస్తులు అమ్మకూడదు. భార్యతోడులేకుండా యజ్ఞయాగాదికార్యాలు చేయరాదు. స్త్రీ పుట్టింటినుండి అరణంగా తెచ్చుకున్న ఆస్తులు ఆభరణాలు పై భర్తకెటువంటి అధికారము వుండకూడదు. ఒకవేళ ఆమె మరణిస్తే స్త్రీ సంతతికే చెందాలి అంటూనే, మళ్లీ భర్త సంపదలో సమానాధికారం వుంటుందన్నారుపైగా–

స్త్రీ ధనానితు యోమోహాదుప జీవంతి భాంధవాః
నారాయానాని వస్త్రంవా తీపాపాయాంత్య ధోగతిం॥

అన్న 3వ అధ్యాయాలోని 57 శ్లోకానికి – స్త్రీ వస్తువాహనములు హరించిన బంధువులు (తండ్రి, తోబుట్టువులు, భర్త సంబంధీకులు) అధోగతిని పొందుతారని అర్థం. కనుక ఆర్థిక విషయంలో ఆమెకు ఇబ్బందిలేకుండుటకు కొన్ని నియమాలేర్పరిచారు. భార్యాపుత్ః స్వకాతనుః' అంటూ భార్యాపుత్రులు అతని శరీరములోని భాగములేకాని భేదం లేదన్నారు.

'త్వమేవాంహం' అనేభావనలో అసమానతలకాస్కారమేలేమి అడుగడుగునా స్త్రీ అభ్యున్నతి కేన్నో సోపానాలేర్పరిచిన మనుస్మృతి మహిళామణుల చిరస్మృతి. (సశేషం)

# పూదోట లింగావధూత (17వ శతాబ్దం)

(గతసంచిక తరువాయి)

- ఆచార్య బి. రామరాజు

లింగావధూత అపుడపుడు ఆశువుగా వేదాంతతత్త్వాలు పాడేవారు. వాటిని కంఠస్థం చేసి మిగతా సాధువులు గ్రామాలు తిరుగుతూ పాడేవారు. తేట తెలుగులో గొప్ప వేదాంత విజ్ఞానం ఇమిడించిన స్వామివారి తత్త్వాలు విన్న పామరులే కాదు పండితులూ మెచ్చేవారు. ఒకానొక సమయాన పుష్పగిరి పీఠాధిపతులు నంద్యాలకు వచ్చి ఆంజనేయాలయంలో విడిది చేసినారు. అటునుండి పోతున్న ఒకసాధువు ''సుజన సంగతిని శోధించి తత్త్వముల - నిజగురుని మార్గమున నిలిచి వేడుకను, అజహరిరుద్రాదులరసి చూడగరాని - నిజ సత్పదంబునై నేవెలింగెదను'' అనేతత్త్వం పాడుతుండటం విని ఆతణ్ణి పిలిపించుకొని ఊరుపేరులడిగి ఆతత్త్వమెవరి రచనవని అడిగితే ఆ సాధువు లింగావధూతగారిని గురించి వివరించినాడు. వెంటనే జగద్గురువులు అవధూత స్వామిని తోడ్కొని రావటానికి పల్లకితో శిష్యులను పంపించినారు. లింగావధూత తాము రాలేమన్నారు, అవసరమనుకుంటే జగద్గురువులనే ఒంటరిగా రమ్మన్నారు. ఆసమాచారం విన్నజగద్గురువులు లింగావధూత గొప్ప సిద్ధపురుషులని గ్రహించి తామే కానాలకు బయలుదేరినారు. అల్లంత దూరాన పల్లకి దిగి శిష్యులను నిల్పి ఒంటరిగా లింగావధూతను సమీపించినారు. పరస్పరాభివాదములైన తరువాత ఒంటరిగా రమ్మంటే ఇద్దరేల వచ్చినారని లింగావధూత ప్రశ్నిస్తే శిష్యులందరూ దూరాన ఉన్నారు కనుక తామొక్కరే వచ్చినామన్నారు జగద్గురువులు. కాని అవధూతస్వామి జగద్గురువుల స్థూల దేహం ఒకటీ దానినీడ ఒకటీ ఇద్దరూ వచ్చినారన్నారు. తామున్న చెట్టు నీడనుండి బయటికి వచ్చి తామొక్కరే అనీ తమకు నీడ లేదనీ, నీడలేక పోవటం చిన్మయ యోగసిద్ధి అనీ చెప్పి జగద్గురువులకు ఆశ్చర్యానందాలు కలిగించినారు. ఆది శంకరులవలె వెలిగి పోతున్న లింగావధూతను జగద్గురువులు స్తుతించి ప్రార్థించినారు. లింగావధూత తమ అవతారోద్దేశము, తమ గురుపరంపర, తమగురువు శివరామబ్రహ్మం, వారిగురువు శ్రీరామచంద్ర పరబ్రహ్మముల గూర్చి చెప్పి జగద్గురువులను సాగనంపినారు. జగద్గురువులు నంద్యాలకు తిరిగివచ్చి ఆంజనేయాలయం ప్రవేశించినారు. ఆంజనేయ విగ్రహం తావున, లింగావధూత స్వామి దివ్యమూర్తిని దర్శించి సంభ్రమాశ్చర్యాలకు లోనై జోహారు లర్పించినారు.

కానాల సమీప గ్రామంలో మంత్రసిద్ధుడైన ఒక బ్రాహ్మణుడుండేవాడు. అతడు తన శక్తులతో ప్రజలను భయభ్రాంతులను చేస్తుండేవాడు. గొప్ప వారిపై తన శక్తులు ప్రయోగించి పరీక్షించేవాడు. మిగతావారిని ఉపేక్షించి అల్పులుగా చూచేవాడు. ఒకసారి నంద్యాలలో సాధు సంతుల సమావేశం జరుగుతుంటే వాళ్ళను పరీక్షించటానికి వెళ్ళినాడు. ఈతణ్ణి ఎరిగిన కొందరు సాధువులు ''అయ్యా! మేమల్పులం మాపై మీమంత్రశక్తులు ప్రయోగించవద్దు, మీకు వేడుకగా ఉంటే కానాలకు పొండి. అక్కడ ఊరిబయట చెట్టుక్రింద లింగావధూత అనే మహాత్ముడున్నాడు. ఆయన మీ కంటె గొప్పవాడు, మీ శక్తులు ఆయనపై ప్రయోగించండి' అన్నారు. ఆ మాటలు విన్న మాంత్రికుడు రోషంతో వెంటనే గుఱ్ఱమెక్కి బయలుదేరి కానాల చేరి, చెట్టుక్రింద ధ్యానంలో ఉన్న లింగావధూతను చూచినాడు. దర్శనమాత్రం చేతనే ఆతని హృదయంలో ఒక మెరపు మెరసినట్లైనది. అవధూత శక్తులేమిటో పరీక్షిద్దామని గుఱ్ఱంపై నుండే మూడుసార్లు మహాశక్తి ప్రయోగం చేసినాడు. లింగావధూత మూడుసార్లు ఆశక్తులను తమ తొడక్రిందికి త్రోసి ఏమీ జరుగనట్లు నిశ్చింతగా కండ్లు మూసుక కూర్చున్నారు. మహాప్రవాహంలో గడ్డి పోచలవలె తనమహాశక్తులు కొట్టుకపోగా మాంత్రికుడు లింగావధూత భగవదవ తారమని గుర్తించి సాష్టాంగ పడ్డాడు. అతని అహంకార హిమశిఖరం కరిగి కన్నీరుగా పారింది. ఇంతలో లక్ష్మమ్మ స్వామికి నైవేద్యం తెచ్చి పెట్టి నిన్నటి భుక్తశేషం మహాప్రసాదంగా తీసుకొని, స్వామి యెదుట సాష్టాంగ పడ్డ మాంత్రికుని చూచి ఎవడో ఆర్తుడనుకొని తన దారిన తాను పోయింది. ఇట్లా మూడుదినాల దాక లింగావధూత స్వామి కండ్లు తెరువకుండా ధ్యానంలో ఉన్నారు. మాంత్రికు డా మూడు దినాలు సాగిలపడి ఉన్నాడు. లక్ష్మమ్మ నైవేద్యం

తస్తున ఉంది. స్వామి రెండు దినాల నుండి నైవేద్యం ముట్టినట్లు లేదు. మూడవ నాడు స్వామి కండ్లు తెరచినారు. మాంత్రికునికి అభయం ప్రసాదించినారు. అతడు తన అపరాధం క్షమించి అనుగ్రహించుమన్నాడు. క్షమాగుణ సంపన్నులైన స్వామి మాంత్రికుణ్ణి లేవనెత్తి, బిడ్డా! నీమంత్రశక్తులన్నీ త్యాగం చేయి. నీవు ఇప్పటినుండి పూదోట రెండవ పుత్రుడవు. ఈనాటినుండి నీపేరు దాసావధూత'' అంటూ హస్తమస్తక సంయోగం చేసి అఖండానంద ప్రసాదం, తత్త్వజ్ఞానార్హత ప్రసాదించి ప్రారబ్ధ విముక్తుణ్ణి చేసినారు. లక్షమ్మ తననుగూడ అనుగ్రహించి దాసురాలిని చేసుకొండని ప్రార్థించింది. స్వామి ఆమెతో ''బిడ్డకు పెట్టినట్లు నాకు ప్రతిదినం ప్రసాదం పెడుతున్నావు కనుక నీవు నాకు తల్లివి నీకేమి కావలస్తే అది ఇస్తాను'' అన్నారు. ఆమెకు రామ తారకమంత్రం ప్రసాదించినారు. ఈ విధంగా పూదోట బ్రాహ్మీలతకు మరో రెండు దివ్యపుష్పాలు పూసినవి. లక్ష్మమ్మ ప్రతి దినం స్వామివారితో పాటు దాసావధూతకు నైవేద్యం స్వహస్తాలతో వడ్డించి భుక్త శేషం ప్రసాదంగా తీసుక పోయేది. కానాలలో ఈశ్వరమ్మ అనే వైశ్యమహిళ స్వామి వారికి ఇంకొక అనన్యభక్తురాలు.

ఒకనాడు దాసావధూత లింగావధూతతో ''మీకు ఒక కుటీరం నిర్మిస్తాను, కానాలలో భిక్షించిప్రసాదం తెస్తాను, అనుమతించండని కోరినాడు. స్వామి ''కుటీరనిర్మాణానికి అభ్యంతరం లేదుగాని లక్ష్మమ్మభిక్ష మాన్పిస్తే ఆమె బాధపడుతుంది కనుక రేపు ఆమెనడిగిన తరువాత నిర్ణయం తీసుకుందా'' మన్నారు. మరునాడు లక్ష్మమ్మ నడిగితే తనకు లభించిన అవకాశ భాగ్యం నిరాకరించవద్దని ఏడ్చి బతిమాలింది. స్వామివారు 'ఇతరులకు కూడ ఆభాగ్యం లభించాలెగదా!' అంటూ ఆమెను అనునయించి ప్రతిదినం నీయింటినుండే భిక్ష ప్రారంభం ఔతుందని ఆమెను తృప్తి పరచినారు. మరునాటినుండి దాసావధూత కానాలలో ''గురుధర్మకోదండ భిక్ష'' ప్రారంభించినాడు. రెండు జాముల వేళ ముందుగా లక్ష్మమ్మయింట తరువాత 10-15 ఇండ్లు తిరిగి భిక్ష స్వీకరించివచ్చేవాడు. అభిక్ష తమ యిరువురికీ స్వామివారిని దర్శించవచ్చిన వారికీ సరిపోయేది. నాడు ప్రారంభమైన ఈ ఆచారం వందలేండ్లు గడిచినా ఈనాటికీ అవ్యాహతంగా సాగుతున్నది. ఆ ప్రసాదం తినేవారికి శారీరకపుష్టి మానసిక తుష్టి లభిస్తున్నాయి.

ఒకనాడు దాసావధూత భిక్షకై వైశ్యవీథి ప్రవేశించిన సమయాన ఒక కాటిపాపల మాంత్రికుడు ఇద్దరు భార్యలు వెంటరాగా తన క్షుద్రశక్తులు ప్రదర్శిస్తూ తేళ్లూ పాములూ విడుస్తూ వైశ్యులను భయపెడుతూ డబ్బు దండుకుంటున్నాడు. దాసావధూత వాణ్ణి మందలిస్తే వాడు దాసావధూతను తూలనాడినాడు. గురువానతి లేకుండా వాణ్ణి ఏమీ చేయరాదని దాసావధూత తేళ్ళు పాములు విడువకుండా వాని చేయి స్తంభింప చేసి ఆశ్రమానికి వెళ్ళి పోయినాడు. కాటిపాపలవాడు వాని భార్యలు తమకు పట్టిన దుర్గతికి ఏడుస్తుంటే చుట్టు మూగిన జనం లింగావధూత దాసావధూతల సంగతి చెప్పి, వారిని శరణు వేడుకొండని హితం బోధించినారు. వెంటనే ఆముగ్గురూ లింగావధూత ఆశ్రమానికి వచ్చి స్వామికాళ్ళపై పడ్డారు. స్వామి వాళ్ళను క్షమించి '' ఇప్పటినుండి మీక్రూరవృత్తులు మాని నా ఆశ్రమంలోనే ఉండిపొండి'' అన్నారు. ఆ ఇద్దరు స్త్రీలకు రామాతారకమంత్రోప దేశం చేసి వారికి జ్ఞానేశ్వరి యోగేశ్వరి అని నామకరణం చేసినారు. మాంత్రికుని తల కొరిగించి శక్తులన్నీ అగ్నిలో వేల్చి స్నానం చేయించి కొత్త బట్టలిచ్చి మహామంత్రోపదేశం చేసి వానికి భద్రావధూత అని నామకరణం చేసినారు. దాసావధూత తరువాత భద్రావధూతను గురుపీఠానికి అధికారిగా ప్రకటించినారు. అ ముగ్గురు స్వామివారి ఆశ్రమంలోనే ఉంటూ స్వామిని సేవించి ఆధ్యాత్మిక ప్రగతి సాధించినారు.

కానాల సమీపగ్రామ భక్తులు ఒక ఏకాదశీవ్రతానికి స్వామిని ఆహ్వానించినారు. దశమి సాయంకాలం స్వామివారా గ్రామం చేరినారు. కానాలలో స్వామివారి ఏకాంతభక్తురాలు ఈశ్వరమ్మకొడుకు పెండ్లి జరిగి, మర్లు పెండ్లికి దశమి రాత్రి వధూవరులు కానాల గృహ ప్రవేశం చేస్తుండగా ఒక కాలసర్పం పెండ్లి కొడుకును కరచింది. అతడు చనిపోయినాడు. స్నేహితులు బంధువులు నవవధువు ఏడుస్తుంటే ఈశ్వరమ్మ ఏకాంతంలో గురువును ధ్యానింపసాగింది. అప్పుడు రాత్రి 11 గంటలసమయం. భక్తురాలి ఆపదను గుర్తించిన స్వామి వెంటనే తమ ఆశ్రమానికి వచ్చి దాసావధూతను భిక్షకై కానాలగ్రామానికి పొమ్మన్నారు.

[illegible] దాసావధూత దీపం వెలుగుతున్న ఈశ్వరమ్మ యింటిముందు నిల్చి భిక్ష యాచించినాడు. వరుడు చచ్చి పీనుగై ఉంటే భిక్ష అడగటానికి నీకు నోరెట్లా వచ్చిందయ్యా అని అక్కడున్న వాళ్లు ఈసడించినారు. దాసావధూత మాట గుర్తించి ఈశ్వరమ్మ లేచివచ్చి నవవధువుచేత భిక్షపెట్టించింది. దాసావధూత ఆశ్రమానికి పోయి గురుదేవులకు ఈశ్వరమ్మ ఇంట జరిగిన దారుణం వినిపించినాడు. స్వామి మందహాసం చేసి ఈశ్వరమ్మను వధూవరులను తీసుక రమ్మన్నారు. వారి వెంట బంధువులు, కొందరు గ్రామప్రజలు ఆశ్రమం చేరినారు. స్వామి దాసావధూతచేత వధూవరులకు అభిషేకం చేయించి పసుపుబట్టలు కట్టించి మృతుని నెత్తిపై తమ దివ్యహస్తముంచి పునఃప్రాణప్రతిష్ఠ చేసినారు. అయిరువురికీ ఆశ్రమంలో మరలపెండ్లి చేయించి, కానాల గ్రామప్రజలకు పెండ్లి వారికి విందుభోజనాలు పెట్టించినారు. మరునాడు సాయంకాలం దాకా ఆశ్రమం భక్తుల నామ సంకీర్తనం లింగావధూత స్తోత్రపాఠాలతో మారు మ్రోగింది. స్వామి మహిమలు అలలవలె దూర దూరాలకు వ్యాపించినవి.

బనగాన పల్లెలో స్వామి భక్తురాలైన నాట్యసుందరి ఒకరాత్రి నాటకంలో సత్యభామపాత్ర నటిస్తుండగా కాగడామంటలు ఆమె వస్త్రాలకంటుకున్నవి. హాహాకారాలతో నాటక శాల దద్దరిల్లింది. కౌరవుల కొలువులో ద్రౌపది శ్రీకృష్ణ పరమాత్మను పిలిచినట్లు నాట్యసుందరి లింగావధూతను పాహిపాహిమా మని ప్రార్థించింది. ఆసమయాన ఆశ్రమంలో స్వామి తమ అంగవస్త్రంతో మంట లార్పుతున్నట్లు నటించినారు. అక్కడ నాట్యసుందరి రక్షింపబడింది. మరునాడామె కానాలకు వచ్చి స్వామికి కృతజ్ఞతలు తెలిపి తన వృత్తి మాని స్వామిసేవలో చేరి పోతానన్నది. స్వామి ఆమెకు రామతారకముపదేశించి రెండేండ్ల సాధన తరువాత ఆశ్రమానికి రమ్మన్నారు.

లింగావధూత తమ ఆశ్రమంలో ప్రతిదినం సాయంకాలం తత్త్వబోధ చేస్తూ పాటలు పాడేవారు. దాసావధూత ఆపాటలన్నీ తాటాకులపై ఎత్తి వ్రాసినాడు. 715 పాటలు 13 దళాలుగా ''పూదోట తత్త్వ గీతామృతం'' పేరుతో శివరామగురుని కంకితంగా ఈ గ్రంథం 10వ పీఠాధిపతి శ్రీ ఆనందనాదస్వామి 1962లో ప్రకటించినారు. ఈ ఆనంద నాదస్వామితో నాకు 1976లో పరిచయం కలిగింది. నా థీసిస్ 'తెలుగుజానపద గేయ సాహిత్యము'' రెండవ ముద్రణ మప్పుడు (1978) ఆనందనాదస్వామివారు నాకు వ్రాసిన జాబుల ననుసరించి తత్త్వాలకు అర్థవివరణం ఇచ్చినాను. లింగావధూత ప్రచారం చేసిన తత్త్వాన్ని మహాద్వైతం అంటారు. ఆయన యోగాన్ని పరమయోగమంటారు. భగవద్గీత సప్తశతి వలెనే పూదోట లింగావధూత రచించిన తత్త్వగీతామృతం 700 తత్త్వాల సంపుటి. శివరామ గురుడు సమస్త విశ్వాన్ని పూదోటగా సంభావించి దానికి సంకేతంగా మఠాన్ని పూదోట అన్నారు. అద్వైతుల జగన్మిథ్యావాదం మూలంగా వేదసంస్కృతి పెడదారి పట్టిందనీ కనుక ఈసనాతనమతాన్ని మహాద్వైతమన్నారు. విశ్వప్రజలందరికీ ఏకసూత్రసాధనా ప్రణాళికకోసం తమమతానికి విశ్వవిజ్ఞాన మతమని నామకరణం చేసినారు. మహాత్ములందరూ బోధించిన జీవన్ముక్తి 'సరిగమపదనిస' ఆరోహణం మాత్రమే. లింగావధూత దృష్టిలో అది ప్రథమపాఠం. బ్రహ్మశక్తిని భౌతిక జీవనానికి తెచ్చి సంపూర్ణ జీవనంతో చిన్మయధారణ చేయటం అవరోహణ ''సనిదపమగరిస'' అనే రెండవ పాఠంతో చైతన్య జడసంధానం చేసి చిన్మయయోగంగా రూపొందించినారు. తమ ఈయోగాన్ని పరమయోగమన్నారు 'తత్త్వ గీతామృతం'లో మంత్రయోగ దృష్టిలయయోగ హఠయోగ రాజయోగములు వివరించే గీతాలున్నవి. లింగావధూత స్వామివారు భగవద్గీతలవలె జీవమండల, విశ్వమండల, పురుషోత్తమమండల, తత్త్వమండల సాధనా పథకం బోధించినారు. వేదవ్యాసుల తరువాత విశ్వమండల సాధనను బోధించనవారు స్వామివారేనట.

లింగావధూతల ప్రబోధల మూలంగాను, వారు ప్రదర్శించిన లీలల మూలంగాను, పూదోట తత్త్వజ్ఞాన సంప్రదాయం ఆంధ్రకర్ణాటకదేశాల్లో బాగా వ్యాపించింది. తత్ఫలితంగా బనగానపల్లెలో, నవలకొండపైన, గొల్ల పేటలో, కానాలలో, బేతం చెర్లలో, శివవరంలో, తరిమెలలో, గాడిలంకలోను మఠాలు వెలసినవి, ఆ మఠాలద్వారా లింగావధూత స్వాముల సందేశం దూరదూరాలకు వ్యాపించినది.

ఇట్లు జరుగుచుండగా లింగావధూత ఒకనాడు [illegible] ఉన్న సమయమున [illegible]
ప్రత్యక్షమై అవధూత దేహం చాలించే సమయం ఆసన్నమైనట్లు చెప్పినారు. స్వామివారు తమ శిష్యులకీ విషయం చెప్పి జ్యేష్ఠశుద్ధ పూర్ణిమ నాడు దాసావధూతకు పట్టంకట్టినారు. వారం దినాల్లో సంగమేశ్వర యాత్రకు బయలుదేరినారు. వెంటనున్న జ్ఞానేశ్వరి దాసావధూత భద్రావధూతలు సంకీర్తనం చేస్తుండగా కానాల విడిచి నంద్యాల చేరి కుందునదిలో స్నానం చేసి ప్రక్క గ్రామంలో భిక్షచేసినారు. ఇంతలో లక్ష్మమ్మ ఈశ్వరమ్మలు అక్కడికి చేరినారు. స్వామివారు శిష్య సమేతంగా జ్యేష్ఠ బహుళ ఏకాదశినాడు సంగమేశ్వర తీరాన చిన్నవనం చేరినారు. ద్వాదశినాడుదయం దాసావధూత లింగావధూత స్వామివారికి పంచామృతస్నానం చేయించి నూత్న వస్త్రాలంకృతులను చేసినారు. జ్ఞానేశ్వరి యోగీశ్వరి లక్ష్మమ్మ ఈశ్వరమ్మలు స్వామికి ఆరతులిచ్చినారు. భక్తులందరూ జయ జయ ధ్వానాలు చేస్తుండగా స్వామి కృష్ణాప్రవాహం సమీపిస్తుండగా జ్ఞానేశ్వరి తానుగూడ వెంటరావటానికి అనుమతి పొందినది. మోకాలిబంటి నీటిలోనికి పోయి స్వామివారు భక్తులకు చరమసందేశంగా ఒక గీతం పాడినారు. దాసావధూత కృష్ణాతరంగాలపై గురువులకోసం కృష్ణాజినం పరచినాడు. దానిపై స్వామి పద్మాసనస్థులై కూర్చుండి ప్రవాహమధ్యంలోనికి వెళ్ళినారు. వారి దేహం చుట్టూ మంటలు లేచి ఆ మంటలు ప్రకాశంగా మారి సూర్యమండలం వైపు పోయినవి. జ్ఞానేశ్వరి లింగదేవుని ఆత్మబింబంలో చేరి పోయింది. దాసావధూత భద్రావధూత ఈశ్వరమ్మ లక్ష్మమ్మలు గురుపాదుకలను తత్త్వగీతామృతమును కానాల మఠంలో ప్రతిష్ఠించినారు. పూదోట లింగావధూతస్వాముల ఆరాధనోత్సవాలు ఏటేట జ్యేష్ఠబహుళ ద్వాదశినాడు అన్ని మఠాల్లోను వైభవంగా జరుగుతాయి.

విష్ణ్వంశసంభూతులైన పోతులూరి వీరబ్రహ్మం శివపంచాక్షరిని ఉపాసించటం, శివాంశ సంభూతులైన లింగావధూత శ్రీరామ తారకం ఉపాసించటం శివకేశవాభేదం చాటటానికే.

పోతులూరి వారి తత్త్వాల్లో బహుళంగా ఉన్న చాటుమాటలు మార్మిక సంకేతాలు పూదోట వారి తత్త్వాల్లో అరుదు. స్వామి వారి రచన తెలుపటం కోసం ఒక గీతం ఉదాహరిస్తున్నాను.

సుజనసంగతి తా శోధించి తత్త్వముల
నిజగురుని మార్గమున నిలచి వేడుకను
అజహరిరుద్రాదు లరసి చూడగరాని
నిజ సత్పదంబునై నే వెలుంగుదును.

ప॥ భ్రమరకీటకము గతి పరమాత్మ ధ్యానించి
అమితమగు నిజశూన్యమై యుందు నెపుడు ॥భ్రమర॥
జలమధ్యమున హృదయ జలజాంతరంగమున
కలిత నాదము బిందు కళలాక్రమించి
మొలక నగవుల దివ్య మోహనాంగుని మీరి
తలపోయ శుద్ధ చైతన్యమైయుందు నెపుడు ॥భ్రమర॥
ఎఱుక గురునితో గూర్చి యెఱుకలన్నియు మరచి
ఎఱుకలకు మొదలైన ఎఱుకలన్నియు మీరి
ఎఱుకలకు మొదలైన ఎఱుక తానగుచు
పరికించ పూదోటపై నిరాలంబమై
అరయ వెలిలోనిండి మెరయుచుండుదును. ॥భ్రమర॥

**ఆధారాలు :-**

1. శ్రీ పూదోట తత్త్వగీతామృతము - 1962
2. శ్రీ పూదోట లింగావధూత స్వామి వారి అవతారము - 1983

- ఆనందనాదస్వామి, పూదోట మఠం, బేతం చేర్ల - 518 599 కర్నూలుజిల్లా.

# విశ్వవాస్తు - సైంటిఫిక విశ్లేషణ

**గృహవాస్తు**

వాస్తుపండిట్: యస్.వై.రెడ్డి

విశ్వంలో మానవ మనుగడ సజావుగా సాగడానికి భగవంతుడు మానవాళికి ప్రసాదించిన అద్భుత వరం వాస్తు. వాస్తుకు పంచభూతాలే ప్రాణం. అష్టదిక్కులే ఆధారం. నవగ్రహాలే నాందిగా శుభాభుభ ఫలితాలను మానవజాతికి అందిస్తుంది – వాస్తు.

శుభాశుభ ఫలితాల విషయానికొస్తె వాస్తుకనుగుణంగా ఉన్నచోట మంచి ఫలితాలు అందడం, వాస్తుకు వ్యతిరేకంగా ఉన్నచోట దుష్ఫలితాలు కలగడం లాంటి విషయాలను మనం అనేక ఇండ్లలో గమనించవచ్చు. వాస్తు నియమాల విషయానికొస్తె ఇంటికి తూర్పులో తప్పక ఖాళీ స్థలం ఉండాలి. అన్నది వాస్తు నియమం అయితే తూర్పులో ఖాళీ స్థలం ఎందుకు ఉండాలి? అన్న ప్రశ్నకు సైంటిఫిక్ విశ్లేషణ ఇచ్చినప్పుడు 'వాస్తు ఒక మూఢనమ్మకం' అన్న అపవాదు తొలగిపోతుంది. అలాగే తూర్పు ఈశాన్యంలో సింహద్వారం, లేక ద్వారం తప్పక ఉండాలన్నది గూడా వాస్తు నియమాలలో ఒకటి. దీనికి సైంటిఫిక్ విశ్లేషణ విషయానికొస్తె తూర్పులో ఖాళీస్థలం, ద్వారం ఉండడం వలన సూర్యకిరణాలు ఇంటిలోనికి ఇంటి ఆవరణలోనికి చొచ్చుకు వస్తాయి. సప్తవర్ణాలను తనలో మిళితం చేసుకొని మానవ మనుగడకు ఆధారభూతమైన ఆపద్భాంధవుడు సూర్యుడు. సూర్యరశ్మిలో మనిషి వెన్నెముకకు ( ఎముకలకు 'డి' విటమిన్) బలాన్నిచ్చే శక్తి ఉండడంతో పాటు సూక్ష్మక్రిములను నాశనం చేసే శక్తి గూడా ఉందన్నది శాస్త్రీయంగా నిరూపించబడిన సత్యం. పై కారణాలవలన తూర్పులో అధిక ఖాళీ స్థలం ఉండాలన్నది శాస్త్ర నియమం. ఉదయకాలపు సూర్యరశ్మిలో మాత్రమే మానవ శరీరానికి పోషకవిలువలనిచ్చే శక్తి ఉండడం వలన తూర్పు ఈశాన్యంలో ద్వారం ఉండాలన్న నియమం ఏర్పడింది. అలాగే సాయంకాలపు ఎండ, నైరుతి నుండి వీచే గాలులు మానవ శరీరాలకు అంత మంచివి కాదు అందువలనే నైరుతిలో ద్వారాలు గాని, పశ్చిమములో అధిక ఖాళీ స్థలం గాని ఉండగూడదన్నది శాస్త్ర నియమం. ఇపుడు తూర్పు – పశ్చిమ దిశలో వాస్తు శాస్త్ర నియమాలకు విరుద్ధంగా లేక అనుగుణంగా ఉంటె కలిగే ఫలితాలను తెలుసుకుందాం.

**I. తూర్పులో తక్కువ ఖాళీ స్థలం లేదా అసలు లేకపోవడం వలన కలిగే ఫలితాలు:-**

1. దీని ప్రభావం మగసంతానంపై ఉంటుంది
2. పిల్లలు శారీరక బలహీనులుగా, వికలాంగులుగా ఉండవచ్చు
3. మగపిల్లలు బుద్ధిహీనులుగా, మందమతులుగా ఉండవచ్చు
4. ఆడపిల్లలు కన్నా మగపిల్లలు చదువులో వెనకబడి ఉంటారు.
5. ప్రతిభ పారితోషికం తగిన ప్రొత్సాహం ఉండదు.
6. అనవసరంగా ఇతరుల కోపతాపాలకు గురి అవుతారు.
7. రావలసిన పేరు ప్రతిష్టలు అందకుండా పోతాయి.

8. మగవాళ్ళకన్నా ఆడవాళ్ళు పెత్తనం చలాయిస్తారు.
9. కొన్ని యిండ్లలో మగసంతానం ఉండదు.
10. ఈవిధంగా ఉన్న ఇళ్ళు భవిష్యత్తులో అమ్మవలసిరావచ్చు.
11. కొన్ని ఇళ్ళు క్రమంగా ఆడవారి ఆస్తులుగా మారిపోతుంటాయి.
12. తూర్పుతోపాటు దక్షిణ ఆగ్నేయం నుండి ఉత్తర ఈశాన్యం వరకు కనీసం వెంటిలేషన్ గూడా లేకుండా మూతబడి ఉంటె అటువంటి ఇంట పురుష సంతతి ఉండదు ఉన్నా యాజమానితో సహా అకాల మరణం చెందుతారు.
13. క్రింద పేర్కొన్న కారణాల వలన కొన్ని ఇళ్ళు తూర్పులో ఖాళీస్థలం లేకపోయినప్పటికినీ యోగించడం జరుగుతుంది. తూర్పు ఈశాన్యంలో ఖాళీ స్థలం ఉండడం, ఈశాన్యంలో బావి లేదా పంపు ఉండడం, పశ్చిమం లేదా ఉత్తరంలో రోడ్డు ఉండడం, తూర్పులో రోడ్డు ఉండగూడదు. అంటుడు ఇల్లు ఉండాలి.

**II. తూర్పులో అధిక ఖాళీ స్థలం వల్ల కలిగే శుభఫలితాలు**

1. దీని శుభఫలితాలు ముఖ్యంగా పురుషులపై ఉంటుంది.
2. మగసంతానం అభివృద్ధిలోకి వస్తుంది
3. పిల్లలు (మగ) పెద్దలు హుషారుగా ఉంటారు.
4. ప్రతిభకు తగిన పారితోషికం, ప్రోత్సహం ఉంటుంది.
5. కృషికి తగిన ఫలితం ఉంటుంది.
6. మంచి పేరు ప్రతిష్టలు లభిస్తాయి.
7. పురుషాధిక్యత కొనసాగుతుంది.
8. మంచి విద్యాబుద్దులు అబ్బుతాయి.
9. మంచి ఆరోగ్యవంతులుగా ఉంటారు.
10. ఆస్థులు వంశపారంపర్యంగా సంక్రమిస్తాయి.
11. వీరి అధికారానికి, పలుకబడికి తిరుగుండదు.

---

# ధ్యేయమంత్రము 'గాయత్రి'

ఓం భూః భువః సువః తత్ సవితుర్వరేణ్యం
భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్

''నేను క్రైస్తవుడనైనను సత్యము పలుకుటలో నాకెట్టి సంశయమును లేదు. హిందువుల యొక్క ధ్యేయమంత్రము 'గాయత్రి'. ఇదిలేకుండా ఋషులు గాని, మునులుగాని, మహాపురుషులుగాని జీవింపజాలరు. హిందూమతము ఏ మానవ వ్యక్తిపై విశేషముగా ఆధారపడియుండలేదు. ఈ గాయత్రి ద్వారా తిన్నగా పరమేశ్వరుని నుండియే వారు జ్ఞానమును పొందగలుగుచున్నారు''.

సర్ మోనియర్ విలియం.

*సేకరణ: గాయత్రీస్వామి; పునః సేకరణ: చే.శ్రీ.రె.*

# కబురు

విశ్వహిందూ పరిషత్

హైందవ ఉదారత అపచారమా ?

''కరుణామయి'' అనే ప్రసిద్ధ ఉపన్యాసకురాలు ఈస్టర్న్ బాప్టిస్ట్ థియలాజికల్ సెంటినరి. (అమెరికా)లో ఉపన్యాసం ఇవ్వడానికి వప్పందం జరిగింది. ఎన్నోవారాల క్రితమే లెక్చరుహోలును ఆమె అనుయాయులు కిరాయికి తీసుకోవడం జరిగింది. తీరా ఉపన్యాసం రోజుకి – ''ఆమె ఇక్కడ ఉపన్యసించడానికి వీల్లేదు అని సెంటినరీ అధికార్లు వప్పందాన్ని రద్దు చేశారుట.

ఇంతకూ ఏమిటి ''కరుణామయి'' అపచారం? ప్రతివారు ఎవరి విశ్వాసం ప్రకారం వారు జీవించాలని ప్రబోదిస్తుందట. అది సెమినరీ అధికార్లకు ఆభ్యంతరమైంది. ''ఆమె హిందూ దృక్పధాన్ని వ్యక్తం చేస్తుంది అని మాకు తెలిసింది'' అని సెమినరి వైస్‌ప్రెసిడెంట్ స్కాట్‌రాడిన్ అన్నాడు.

ఆప్రాంతంలో ఆమె ఉపన్యాసాలు ఏర్పాటు చేస్తున్న పాటిల్‌రెడ్డి అనేవారు ''ఆమె ఉపన్యాసాలు హిందూత్వాన్ని గురించి కాదు. ఎవరి విశ్వాసం ప్రకారం వారు జీవించండి అనేదే ఆమె ప్రబోధం'' అని సంజాయిషి ఇచ్చుకున్నా ఏమి ప్రయోజనం లేకపోయింది.

''ఈ భూమండలంలో 70 కోట్లమంది అవలంబించే హిందుత్వం గాస్పెల్ (క్రైస్తవ) సూత్రాలకు పొసగదు. ప్రపంచం అంతటా గాస్పెల్ మాత్రమే ఉండాలని మా సూత్రం''. అందువల్ల ఆమె ప్రసంగించడానికి వీల్లేదని స్కాట్ రాడిన్ వివరణ.

ఆమె మరో నేరం : ఆమెను అనుయాయులు సరస్వతీ స్వరూపంగా ఆరాధిస్తారట. ఆమె ఉపన్యాసానికి అంత కన్న ఇంకేమి అభ్యంతరం ఉండాలని తాత్పర్యం. సత్యసాయి బాబా ఉపన్యాసాన్నయిన అక్కడ రద్దు చేసి ఉండేవారన్న మాట. ఎందువల్ల నంటే అయనను అనుయాయులు ''భగవాన్'' అని ఆరాధిస్తారు కదా!

మనమేమో ఇక్కడ ''కరుణామయుడు'' అని క్రీస్తు సినిమాలు తీసి ప్రచారం చేస్తుంటాం. క్రైస్తవ ప్రచారకురాలు థెరిస్సాను ''భారత రత్న'' అని నెత్తిన పెట్టుకుంటాం. అన్ని మతాలు ఒకటేనని చెప్పుకుంటుంటాం. సత్యసాయి బాబా తమభక్తుల వద్దకు క్రైస్తవులతో సహా అన్ని మతాలవారు వస్తారని ఘనంగా చెప్పుకుంటాం. ఓంకారము, శిలువ చంద్రవంక ముద్రికలను చిహ్నాలుగా పెట్టు కుంటాం. ఊరూరా హిందువుల ఇళ్లమధ్య క్రైస్తవ భజన సంఘాలకు ఇళ్లు అద్దెకిస్తుంటాం (డబ్బుకోసం) మనలెక్చరు హాల్సు మైదానాలు'' స్వస్తత సభలకిస్తుంటాం. క్రిస్మస్ గ్రీటింగ్ కార్డులు పంపుకుంటాం. పిల్లలనీ గొప్పగా క్రైస్తవుల కాన్వెంటులకు చదువుకు పంపిస్తాం. ఆ మధ్య కళ్యాణ మండపాలు కూడా స్వస్తత సభలకు అడుగుతున్నట్లు వినవచ్చింది. మన ఉదారతకు మనమే ప్రశంసాపత్రాలిచ్చు కుంటాం. అవతల వారేమో ''ఎవరి విశ్వాసం ప్రకారం వారు జీవించాల''నడమే తగదని, ''అందరూ క్రైస్తవ విశ్వాసంతో మాత్రమే జీవించాలని అంటూ వప్పందాలను సైతం రద్దు చేస్తారు! మరి ఇలాంటి వైఖరి సాయిబాబా ప్రభృతుల వద్దకు వచ్చే క్రైస్తవాది భక్తులు ఎలా పరిగణిస్తారో, ఏమని వ్యాఖ్యానిస్తారో తెలియదు. నీతులు వల్లించే సోకాల్ సెక్యూలరిస్టులు, క్రైస్తవ మిషనరీలకు స్తోత్రపాఠాలు వల్లించే అధికార అనధికార వర్గాలు, గవర్నర్లు, మంత్రులు, రాజకీయ ప్రముఖులు ఎలా స్పదిస్తారోతెలియదు. అసలింతకూ హిందువుల ఈ ఉదారతలాభించేది హిందువులకా? క్రైస్తవులకా? తదన్యులకా అనేది

ఎక్కడో ఏదో జరిగితే ఏమిటి మన మిక్కడ స్పందించేది అనగలరు మన అతితెలివిసోదరులు. పోనీ ఇక్కడేమి జరుగుతున్నదో చూడండి. మీ ఊర్లో, మీ వీధిలో – చివరకు మీరు లేని సమయంలో మీ ఇంటికి వచ్చి కాగితాలు అందించి సువార్తను చెప్పుతామనే విజిటర్సు సంగతి చూడండి. వారు చెప్పేదివిని సారాంశం గమనించండి. అందరూ క్రైస్తవులు కావాలి. అంటే అందరూ హిందూత్వం వదలాలి. మరి ఈ సందేశానికి ''అక్కడ ఎక్కడో'' జరిగిన దాని లక్ష్యంలో సందేశానికి తేడా ఏమైనా ఉందా? ఈ ప్రపంచంలో చివరకు హిందూ దేశంలో కూడా హిందువులకు, హిందూత్వానికి నిలువ నీడ ఉండరాదు – అనేది తప్ప ఇంకేదైనా సారాంశం ఉందా?

కాకపోతే తేడా ఒక్కటే సర్వత్రా క్రైస్తవం మాత్రమే ఉండాలని క్రైస్తవులంటే, ఇస్లాము మాత్రమే ఉండాలని ఇస్లామీయులంటారు. ఎవరి చోట వారు, ఎవరి విశ్వాసం ప్రకారం వారు జీవించాలని ఉభయులూ అనరు. అలా అనేది ఉదారహిందూత్వం మాత్రమే. దానికి నిలువనీడ లేకుండా చేయడం లోకకల్యాణానికి చాలా అవసరం అని క్రైస్తవీయులు, ఇస్లామీయులు, సెక్యూలరిష్టులు – ముగ్గురు ముక్తకంఠంతో సందేశిస్తారు. ఇందుకుకూడా హిందూ సమాజం స్పందించ దగదా? వాహ్!

తాజావార్త : ఇప్పుడే వాషింగ్‌టన్ నుండి మరొక మాట వినవచ్చింది. ఫిలడల్ఫియాలోని ఒక థియలాజికల్ సెమినరీలో ఏర్పాటయిన మాతా అమృతానంద మయీ ఉపన్యాసాన్ని అధికార్లు రద్దు చేశారట. ఏమిటి కారణం అంటే ఆమె హిందూత్వానికి ప్రాతినిధ్యం వహిస్తుందని అధికార్లు చెప్పారుట.

## ద్రౌపదికి దేవాలయం ఏది ?

ఈ మధ్య సెక్యూలరిష్టు మహాశయులు పురాణ ప్రవచనాలు కూడా ఆరంభించారు. అట్టి ప్రవచనాన్ని ఒకదాన్ని యునైటెడ్ ఫ్రంటు నాయకులు, జనతాదళ్ కార్యధ్యక్షులునైన శ్రీ శరద్ యాదవ్ మహిళల రిజర్వేషన్ బిల్లు సందర్భంగా ఇచ్చారు. ''భారతీయ మహిళలు సీతా సావిత్రులను ఆదర్శంగా తీసుకుంటారుగాని ద్రౌపదిని ఆదర్శంగా తీసుకోరు. సీతా సావిత్రుల లోనూరుశాతం సద్గుణాలుంటే ద్రౌపదిలో 99 శాతం సద్గుణాలున్నాయి. ద్రౌపదిలో లేనిదల్లా ఆ మిగలిన ఇద్దరిలో ఉన్న ఒక్కశాతం గుణం. ఆమెకు ఐదుగురు భర్తలు. నిజానికి మేము భారతంలో నిజమైన హీరో (ఇన్) ద్రౌపది. కృష్ణుడుకాదు. మహిళలు పురుషుల ఆస్తికాదని ప్రకటించిన తొలి మహిళ ద్రౌపది. అయినా ద్రౌపది పేరిట ఒక్క దేవాలయమైనా లేదు'' అన్నారు శ్రీ శరద్ యాదవ్. ద్రౌపదీ ఆలయం లేనందుకు అది విచారపడడమో లేక మరి అన్యమో తెలియలేదు. ఏమైనా ఒకట్టి మాత్రం నిజం ''అహల్య ద్రౌపదీ సీతా తారామండోదరీ తథా'' అంటూ ప్రాతఃస్మరణలో హిందువులు ద్రౌపది నిస్మరిస్తారని ఆయన విన్నట్లు లేదు. అలాగే దేవాలయాలు దేవతలుగా భావింపబడే వారికే నిర్మిస్తారనేది కూడా ఆయనకే తోచినట్లు లేదు. ఇంతకూ మహిళా రాజకీయ రిజర్వేషన్‌కు ఈ పురాణ ప్రవచనానికి సంబంధం ఏమిటో తెలియదు.

# ఆంధ్రకేసరి

రాష్ట్రకవి
డా॥ ఓగేటి అచ్యుతరామశాస్త్రి

(గతసంచికతరువాయి-9.)

కష్టసుఖంబులన్, మఱలఁగష్టములంబడి కాగుచున్నయా
శిష్టకుల ప్రదీపుడు విశిష్టగుణాఢ్యుడు టంగుటూరి, తా
రుష్టుడు గాక శాంతమయ రూఢమనస్కృత దేశసేవనా
నిష్ఠిలొ యింధనంబగుచునిట్టె సమర్పితుడయ్యె భేషనన్

బాల్యం బాదిగనెంద ఱెందరొ మహాభాగుల్ తటస్థింపఁద
త్తుల్యుండైచను భద్రమూర్తి బహుధాతుష్టాత్ముడై వారి వా
త్సల్యంబున్ సరిమాఱగొంచుఁబెను పొందన్ జొచ్చెతానొర! సా
కల్యంబైచను సూర్యమండల సమాకార ప్రకాశంబునన్

తొలుతన్నాతడు కొందఱన్ గలిసి యంతో యింతొ భాషించెఁద
త్ఫలితార్థంబుగ జ్ఞానబోధకలిగెన్ పండెన్న దృష్టంబహో!
భళి! యాపూర్వులఁ గూర్చి చెప్పబడె సంభావించుచున్ కొంతగాన్
మలుతన్నిప్పుడు కొందఱన్ గుఱిచి - సన్మాన్యాత్ములన్ - చెప్పెదన్

కలకంఠి కన్నీరు క్రమకరమ్ములఁదుడువ గాఁబుట్టిన తుహినకరుడు
నవ్యాంధ్రవాఙ్మయ నందన వాటికన్ గద్యచంద్రిక లూదుకలువ ఱేడు
చీకట్ల తెఱలందు చిక్కిన కవి గుంపు జాడలు దీసిన చండరశ్మి
మాఱురూపముఁగొన్న మానవతామూర్తి రామమోహన రాయ రమ్యగుణుడు
ఆంధ్రవైతాళికులయందు నగ్రసరుడు, కందుకూరి కులాంబుధికౌస్తుభంబు
అట్టి వీరేశలింగము నాత్మఁదలచి, యాంధ్రకేసరికైమొడ్చునవరతము

పెద్దక్క జానకి పిన్ననాటనె పోయె, నామెకూతునెతాను నాడె పెండ్లి
తన పెండ్లితోఁ బాటెతనదు చెల్లెలు అన్నపూర్ణమ్మ పెండ్లియు పూర్తియయ్యె
ఆ వృద్ధుబావకేయన్న పూర్ణను యిచ్చి, పెండ్లిచేసెను తన పిచ్చి తల్లి
అంతలోనక్కట యాకస్మికంబుగ, నా వృద్ధబావయునంతరించె
కందుకూరి వారి ఘన ప్రభావంబునఁ, జేయఁదలఁచెఁదిరిగి చెల్లిపెండ్లి
కానియకట! చెల్లికాల ధర్మమునందెఁ, దలచినంత గుండెతరుగుకొనుగు.

తెలుగుమేధావుల తెగయందు దిట్టగాఁ, బేరుఁబొందిన యట్టి పెద్ద యెవడు
ఆంధ్రవర్శిటికిని నాద్యుపాధ్యక్షుడై, తీర్చిదిద్దిన యట్టి ధీరుడెవడు
కవితావిమర్శలోఁగని వినియెఱుగని, క్రొత్త పోకడలను కూర్చెనెవడు
''ముసలమ్మ మరణము'' మొదలగు మహమంచి, కబముల్ వ్రాసిన ఘనుడెవండు

భాషణములఁ జక్రవర్తియితడు, జనులమీఁద బ్రహ్మచారి యితడు
అతడు కట్టమంచియని యెడు మహితుండు, శ్రీప్రకాశమునకుఁజెలిమికాదు.
లండనులోఁదాను 'లా' చదువుచునుండఁ, గేంబ్రిడ్జిపట్టణకెలన నతడు
. బారిష్టరీమఱి పదపడి ' ఎం ఏ' కి, కట్టు చుండినయట్టి కాలమద్ది
గోఖలే మాటపై కోరి పరీక్షను, నా ఖరికెగగొట్టిపోయినుండె
అట్టితరుణమందు నాతనిఁజూడంగ, నాంధ్ర కేసరి మఱియటకుఁబోయె
తెలుగు భారతమాతడు దీక్షతోడఁ, జదువు చుండగఁ జూచి తాచకితుడయ్యె
అంతఁ బోకనుపన్యా సమాత డొసగెఁ, దలచినంతన నిప్పుడు పులకలెగయు!
ఎంత యదృష్టంబొయీ తెల్గువారిది, యలకవిత్రయమిటనవతరించె
మూర్తిత్రయంబును, మువురు సంస్కృతకవుల్, దీటుగా మువ్వురు తెలుగుకవులు
నన్నయ్య తిక్కన్న యెఱ్ఱన్నలను పేర్లను చ్చరించినఁజాలు నోడలు పొంగు
రాజమంద్రిన వారి స్మారక చిహ్నముల్, వేయఁదల్చిన గాని వీలు పడదు
రాజకీయాల వత్తిడి, రగడవలన, క్షణము తీరిక చిక్కదు సత్యమరయ
ననుచు వాపోయెఁగేసరి యనవరతము, అట్టి మహనీయ మూర్తికినంజలిదియ!
దుగ్గిరాలాన్వయ దుగ్ధపాదోరాశి, రత్నదీపమనగరాణకెక్క
తూరుపుకొండపైఁదోతెంచు భాస్కర, బింబమోయనగను వెలుగుఁజిమ్మె
గాయత్రి నాగనుఘనమంత్ర మర్మము,లంద ఆకందించి యనుఘుడయ్యె
హిందవీ సంస్కృతి హితకాంక్షతోడుత, నైక్యతామంత్రమునాలపించె
సకల శాస్త్రార్థ సారాంశ సంగ్రహుండు, సంస్కృతాంధ్రాంగ్ల సంగీత సరసబుధుడు
రామభక్తుడు యోగమార్గానుగామి, యతడు గోపాలకృష్ణయ్య యాంధ్రరత్న
చీరాలపేరాల చిన్ని పట్టణములు, పంచాయితీలుగా వరలుచుండె
వాటిని సర్కారు వర్గీకరించెను, మున్సిపాలిటియంచు మూర్ఖబుద్ధి
ప్రజల కిష్టములేదు, ప్రబలెనాందోళన, మాంధ్రరత్న దానికయ్యెనేత
పట్టణ జనసంఖ్య పదిహేడు వేలది, ఊరు ఊరంతయునుట్టివోయె
ప్రజలు నూరికి దూరాన వలసవోయి, ఇసుక పఱ్ఱలయందున నిళ్ళుగట్టి
వరుసరెండేండ్ల పాటుగ వాసముండ్రి, రామనగరంచుదానికి నామమిడిరి!
చీరాలపేరాల సేమంబుఁ గాంక్షించి, ప్రారభించెను తాను "రామదండు"
ఎఱ్ఱనిచొక్కాల యెనలేని సేనది, ప్రజల విశ్వామిత్ర సృష్టియద్ది
దాని యాధ్వర్యాన తాను సాగించెను, చీరాల పేరాల చెయిదమిదియ
హైందవేయులయొక్క నాత్మశక్తికి నిద్ది, గొప్పతార్కాణగాఁగుదురుకొనియె
గాంధిజీ స్వయముగ కదలి వెళ్ళెనటకు, తానుకూడ నడచెవాని వెంట
అదియ తలచుకొనుచు నానంద బాష్పమున్, కార్చుచుండెశ్రీ ప్రకాశమహహ!

(సశేషం)

# మన్య విప్లవజ్యోతి - అల్లూరి

(జులై మన్యవిప్లవజ్యోతి అల్లూరి సీతారామరాజు శతజయంతి ఉత్సవాలు)

ప్రథమ స్వాతంత్ర్యంలో మంగళపాండే, తాంతియాతోపే, ఝాన్సీలక్ష్మీబాయి, భగత్‌సింగ్ మొ॥ యువకిశోరాలు పోరాటం సాగించి తమ జీవితాల్ని దేశానికి ధారపోశారు అట్టి ఈ కోవకు చెందిన మన్య ''విప్లవజ్యోతి'' మన అల్లూరి సీతారామరాజు.

జననం : **1897** జులై నాల్గువ తేదీన అల్లూరి వెంకటరామరాజు, సూర్యనారాయణమ్మ అనే పుణ్య దంపతులకు ప్రథమ సంతానంగా ఒక మగ బిడ్డ జన్మించాడు. ఆ దంపతులు ఆ బాలునికి 'రామరాజు' అని నామకరణం చేసి అల్లారు ముద్దుగా పెంచసాగారు.

చిన్నతనంలోనే గుర్రపు స్వారీ, కర్రసాము, కత్తిసాము, తాలింఖానాల్లో కసరత్తులు నేర్చుకొని శారీరక ధృడత్వం పెంచుకొన్నాడు. బంధువుల దగ్గర వేదాంతం, యోగాభ్యాసాలను అభ్యాసం చేసి నైపుణ్యత సాధించాడు. ఎక్కువ సమయం ఏకాంతంగా ధ్యానం చేసేవాడు. రానురాను వైరాగ్యసంపన్నుడై స్వాతంత్ర్య పిపాస, జాతీయ భావోద్రేకం ఆయనలో పరిణతి చెంది కొలది కాలంలో మనకా విప్లవవారునిగా మారడానికి ప్రేరణ ఇచ్చాయి.

మన్య పేద ప్రజలను బ్రిటీష్ పాలకులు అవసరాల వరకు వాడుకొని, కనీస సౌకర్య వేతనాలు చెల్లించకుండ పశువుల కంటే హీనంగా చూస్తున్న ప్రభుత్వంపై తిరుగ బడ్డాడు. ఆధునీకరణ ఆయుధాలు, సుశిక్షిత సైన్యం కల్గిన ప్రభుత్వంతో ఎదుర్కోనడానికి, మన్య సీమలోని నవయువకులను, దేశ భక్తి పరులను ఎంచుకొని వారికి ఆయుధబూల శిక్షణ, క్రమశిక్షణ, మంచి అలవాట్లు, స్వదేశీ వస్త్రధారూను నేర్పి తన ''విప్లవసేనగా'' మలుచుకొని పోరాటం కోసం సన్నద్ధంచేశాడు.

ఆధునిక ఆయుధాలు కల్గిన ప్రభుత్వబలగాలలో పోరాటం చేయాలంటే ఆయుధాలు అవసరం అని గ్రహించి ప్రథమంగా **1922** సం॥ ఆగష్టు **22**న చింతపల్లి పోలీసుస్టేషన్‌పై దాడి చేసి, అక్కడి మందుగుండు సామాగ్రినీ ఆయుధాలను స్వాధీనం చేసుకొని, స్వాధీనమైన ఆయుధాల వివరాలను స్టేషన్ డైరీలో వ్రాసి సంతకం చేశాడు. అవరుసలో కృష్ణదేవి పేట ఒమ్మంగి స్టేషన్‌లపై దాడి చేసి తుపాకులను స్వాధీనం చేసుకొన్నాడు. విజయోత్సవంలో వస్తున్న సీతారామరాజుకు, విప్లవదలానికి మార్గమధ్యంలోని గ్రామాల ప్రజలు ''విజయహారతి''తో స్వాగతించి, ఆహారపదార్థాలను వారికి సమకూర్చి వారి అభిమానాన్ని చూరగొన్నారు. రామరాజు ప్రభుత్వానికి చిక్కకుండా చిన్నచిన్న దళాలను పెద్దసంఖ్యలలో ఏర్పరచాడు.

రామరాజు సైనికదళాలకు సింహస్వప్నంగా కాగా ప్రభుత్వం రాజును బంధించడానికి రూథర్‌పర్డ్ నాయకత్వంలో **1125** మంది సైనికులు **28** ఏనుగులు, **12** గుర్రాలు, **2** అంబులెన్సులు, **100** మంది ఎడ్ల బండ్లు **70** మంది జూనియర్ ఆఫీసర్లతో రాగా రుథర్ పర్డ్ రాజును వేధించసాగాడు. జరిమానాలు, జైలుశిక్షలు విధించాడు. మన్యంలోని గ్రామాలను పెట్రోలు పోసి తగుల పెట్టాడు. స్త్రీలను మానభంగం చేశాడు. అష్టదిగ్బంధనం చేసి ఆహారపదార్థాలు రాకుండా చేశారు. విప్లవ వ్యూహారచనలో విప్లవ దళాలలో భేదాభిప్రాయాలు తెలెత్తాయి. గంటందొర అగ్గిరాజుల మధ్య ద్వేషాలు పెరిగాయి. మన్య విప్లవం గతి తప్పిందని రాజు బాధ పడ్డాడు. ప్రజలను రక్షించాలంటే తానులొంగి పోవడము ఒక్కటే మార్గమని తలచాడు.

వారికి తొత్తులై, వారి అడుగులకు మడుగులొత్తుతూ, ఇంద్రియ వాంఛలవాళ్ళై రామరాజు కదలికలను ప్రభుత్వానికి చేర వేశారు. 1922 సం॥లో డిశంబర్ 6న జానువానాయకత్వంలో ముగ్గురు భారతీయ సైనికాధికారులు, 58 మంది సైనికలు రాజు పై దెబ్బతీశారు నలుగురు విప్లవ వీరులు నేలకొరగగా, రామరాజు మిగిలినవారు పోరాడుతూ తప్పించుకొన్నారు. వెంటనే మరో ప్రభుత్వదాడి జరుగుతుందని రామారాజు ఊహించలేదు. అందులో మరో ఎనిమిది మంది విప్లవీరులు వీరోచితంగా పోరాడి రామరాజును ఆ పోరాటం నుంచి తెలివిగా తప్పించి నేలకొరిగారు. ఇది సరిగ్గా ఆనాడు శివాజీ చరిత్రలో సిద్దిజోహారు దాడినుండి శివాజీని రక్షించిన బాజీ ప్రభుని బలిదానం వంటిది.

అశేష ప్రజా హృదయాలలో చెరగని ముద్ర వేసిన సీతారామరాజు మన జాతీయ స్వాతంత్ర సమర వీరుడు. ఆయన మన ఆంధ్రదేశంలో జన్మించడం ఆంధ్రులకు మరింత గర్వకారణం. ఆయన భక్తిరత దేశభక్తి త్యాగశీలాలు, ధైర్యసామర్ధ్యాలు, నిర్మల దక్షత, యువజనావళికి ఆదర్శప్రాయమైనవి. అనుసరించదగినవి. మన్య విప్లవంతోపెనవేసుకొన్న ఆయన జీవితం భారత స్వరాజ్య సమర చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించదగినది, చిరస్మరణీయమైనది. – రమేష్

---

# బజరంగదళ్

విశ్వహిందూ పరిషత్ పశ్చిమ ఆంధ్రా విభాగం యొక్క బజరంగదళ్ వారి సాప్తాహిక శిబిరం కర్నూలులో జున్ 1వ తేదీ నుండి 7వ తేదీ వరకు జరిగినది. వంద మందికి పైగా యువకులు శిబిరంలో పాల్గొన్నారు. శిబిరంలో రోజు ఐదు గంటలు శారీరక సంబంధమైన కార్యక్రమాలు జరిగాయి. ఇందులో రైఫిల్ ఫైరింగ్, కరాటే, ఇతర సాహకృత్యాలు, యోగాసనాలు మరియు దండయుద్ధం వంటివి నేర్పారు శిబిర పారంభోత్సవానికి డా. ఎమ్.వి. ఆర్ శర్మ (కార్యధ్యక్షులు), దక్షిణ భారత సహ సంఘటనా కార్యదర్శి శ్రీ వై. రాఘవులు గారు, దక్షిణ భారత సంఘటన కార్యదర్శి శ్రీ బాబూరావు గారు, విచ్చేసి కార్యక్రమాన్ని ప్రారంభించారు.

శ్రీ బాబూరావు దేశాయి గారు తమ ప్రారంభోపన్యాసంలో సామాజిక సామరస్యత గురించి ప్రసంగించారు.

శ్రీ వై. రాఘవులు గారు బజరంగ్‌దళ్ కార్య ప్రణాళిక గురించి వివరంగా చెప్పినారు.

శ్రీ కశి రెడ్డి వెంకట్‌రెడ్డి గారు హిందు సంస్కృతి యొక్క విశిష్టత గురించి చక్కగా ప్రసంగించారు. హిందూ ధర్మ సంరక్షణలో యువకుల పాత్ర గురించి తమ తరువాతి ప్రసంగాలలో వివరించారు.

శ్రీ అచ్యుత రామ శాస్త్రిగారు శిక్షణా తరగతిలో బోధక కార్యక్రమంలో శ్రీ వివేకానందుడి గూర్చి ఆసక్తిరంగా వివరించారు. తరువాత జరిగిన తరగతులలో బాజీ ప్రభుదేశ్‌పాండే శౌర్యం గూర్చి స్పూర్తి చెప్పారు.

ప్రాంత సంఘటనా మంత్రి శ్రీ సుబ్రహ్మణ్యంగారు, ప్రాంత సహకార్యదర్శి మంత్రి శ్రీ వగాల రామిరెడ్డిగారు, ఆర్. ఎస్. ఎస్. సహ ప్రాంత ప్రచారకులు శ్రీ రామ చంద్రయ్య గారు మరియు ఇతర పెద్దలు కూడా శిబిరంలో మార్గదర్శనం చేశారు.

7 జూన్‌న జరిగిన సమారోప్ కార్యక్రమంలో శ్రీ కె.యి.ప్రసాద్ గారు ముఖ్య అతిథులుగా విచ్చేశారు. శిబిర కార్యక్రమాం విజయవంతంగా ముగియాలని వారు మనస్పూర్తిగా కోరుకున్నారు.

(మా.వి.)

## ప్రాచీన ఆంధ్ర రాష్ట్ర ప్రదేశాలు

| | నాడు | | నేడు |
|---|---|---|---|
| 1. | అశ్మకదేశం | – | బోధన పరిసర ప్రాంతం (నిజామాబాద్) |
| 2. | అవముక్తము | – | భద్రాచలం ప్రాంతం (ఖమ్మం జిల్లా) |
| 3. | ఇందరూరు | – | ఏకచక్రపురం – బోధన్ (నిజామాబాద్) |
| 4. | మెతుకు సీమ | – | మెదక్ (మెదక్) |
| 5. | దేవరాష్ట్రం | – | విశాఖ జిల్లా ప్రాంతం (విశాఖ) |
| 6. | ఎండపల్లి | – | ఆముదాల వలస |
| 7. | ములకనాడు/అసక | – | గోదావరి ఉత్తర ప్రాంతం (తూ.గో.ప.గో.) |
| 8. | నాగభూమి | – | కృష్ణా పరివాహకప్రాంతం (కృష్ణా, గుంటూరు) |
| 9. | వెలనాటి సీమ | – | గుంటూరు జిల్లా తూర్పుప్రాంతం (గుంటూరు) |
| 10. | పూగినాడు | – | గుండ్ల కమ్మనదికిరువైపుల ప్రాంతం (గుంటూరు, ప్రకాశం) |
| 11. | పాకనాడు | – | నెల్లూరు, రాపూరు, ఆత్మకూరు మీదుగా గుండ్ల కమ్మవరకు (నెల్లూరు, ప్రకాశం) |
| 12. | పంట రాష్ట్రం | – | గూడూరు, వెంకటగిరి, సూళ్ళూరుపేట (నెల్లూరు) |
| 13. | ముండ రాష్ట్రం | – | నెల్లూరు చుట్టూ ప్రాంతం (నెల్లూరు) |
| 14. | రేనాడు | – | జమ్మలమడుగు, ప్రొద్దుటూరు, పులివెందుల (కడప) మదనపల్లె, వాయల్పాడు (చిత్తూరు) |
| 15. | హిరణ్య రాష్ట్రం | – | కడపజిల్లా (కడప) |
| 16. | ఇనగల్లూరునాడు | – | పులివెందుల తాలూక (కడప) |
| 17. | ఎండపల్లి | – | శ్రీకాకుళం (జిల్లా) |

సేకరణ – ''ఉదయగిరి''

## హరిజనవాడలో శ్రీరామ మందిరము

(హనుమోజీపాలేం) – ప్రకాశంజిల్లా

హరిజనవాడలో శ్రీరామ మందిర నిర్మాణము, చెఱువుకట్టపైన మంచి ఆహ్లాదకరమైన ప్రదేశములో జరుగుచున్నది. గ్రామములో షుమారు 500 ఇళ్ళు వున్నవి గ్రామములో ఒక్క హిందూదేవాలయముకూడ లేదు.

శానం సుబ్బారావు ఆధ్వర్యమున వైష్ణవ దాసుల సంఘము శ్రీరామాలయ నిర్మాణ భాధ్యతలు చెపట్టియున్నారు. నిర్మాణము మధ్యలో ఆగియున్నది.

విశ్వహిందూ పరిషత్ వారు కూడ సహాయ సహకారము లందించుచున్నారు. దేవభక్తులు తమ తమ సహాయ సహకారములు అందించగోరుచున్నాము M.O.లుగాని, డిడిలు గాని ఈ క్రింద తెల్పిన అడ్రస్సనకు పంపించవలసినదిగా కోరుచున్నాము.

ధనసహాయము అందించవలసిన చిరునామా.
శ్రీ నూనెరామాంజనేయులు
V.H.P. ఒంగోలు
వీరాంజనేయ మెటల్ & జనరల్ స్టోర్సు
గాంధి రోడ్డు, ఒంగోలు, ఫోన్: 33452, 523001

ఇట్లు
జె. వెంకటేశ్వర్లు,
జిల్లా కార్యదర్శి
విశ్వహిందూపరిషత్, ప్రకాశంజిల్లా.

ప్రశ్న : 'చతుస్సాగర పర్యంతం గో బ్రాహ్మణేభ్యః
శుభం భవతు' అని వేద మంత్రం చదువుతారు కదా ! ఆ చతుస్సాగరముల ఏవి? నాటి గురించి వివరంగా తెలియజేయగలరని ప్రార్థన.

టి.యాదగిరిరావు, కోఠి, భాగ్యనగర్

జ. భూగోళంలో భూభాగం చుట్టూ ఉన్న ఆర్కిటిక్ మహాసముద్రము, పసిఫిక్ మహాసముద్రము, దక్షిణ మహాసముద్రము, అట్లాంటిక్ మహాసముద్రములు చతుస్సాగరములు. సాగరములనుండి వచ్చే ప్రాణవాయువును పీలుస్తూ మానవుడు నేలమీద బ్రతుకుతున్నాడు. మానవునికి భౌతికంగ ఉండటానికి భౌతికదేహం చోటు. అట్లాగే. ఆధ్యాత్మిమ్మకంగ వివేకపరంగ ఉండటానికి బుద్ధి అతనికి చోటు. విషయాలలో కలిగే విపరీతాలన్నిటికీ ఆత్మనుండి ఆధ్యాత్మిక ప్రాణాన్ని గ్రహిస్తూ బుద్ధిలో నివసించాలి మానవుడు. నాలుగు మహాసముద్రములనుండి నేలమీదికి ప్రాణవాయువు వచ్చినట్లు, తన విషయాలన్నిటికి నలువైపుల అన్నికోణాల్లో అంతటా వ్యాపించియున్న ఆత్మనుండి ఆధ్యాత్మిక జీవనాన్ని గ్రహించాలి, ఇది మాటలతోకాక చేతలలో సాధించాలి. గోవు, బ్రాహ్మణులు సాధుత్వానికి ఉపమానాలు. గోవు భౌతికంగ (విడిచే మలమూత్రముల వఱకు) సాధువుగ డిజైన్ చేయబడిన రూపం. బ్రాహ్మణత్వము ఆధ్యాత్మికంగ సాధువుగ డిజైన్ చేయబడిన లక్షణము. భౌతికంగానూ, ఆధ్యాత్మికంగానూ పైన, విచారించుకున్న చతుస్సాగర పర్యంతమైన గోబ్రాహ్మణ లక్షణములకు నిత్యము శుభమగుగాక, అని వేదమంత్రార్థం.

భూగోళంలో ఎక్కువ (79శాతం) నీరు ఉన్నప్పటికీ దానిని భూమి అని అన్నారు. అంటే నేల భూమి అనే అర్థంలో కాక ఉంటానికి అవకాశ మిచ్చే చోటు అని విశాలార్థం. ఈ వేదమంత్రంలో కూడా ''చతుస్సాగర పర్యన్తం'' ''అంతటా వ్యాపించిన ఆధ్యాత్మిక జీవన అవకాశం కలిగి నటువంటి'' అని విశేషణం ప్రధానంగ చూపబడినది. విశేషణమైన ''భూమి'' పదం మంత్రంలో లేదు. సాధకులు మంత్రంలోని తత్త్వ దృష్టిని గ్రహించాలి.

---

## ప్రశ్న - జవాబు (గతసంచిక తరువాయి)

ప్ర.1 మరి ప్రభుత్వము ఆ ఉద్యమాన్ని ఎందుకు అణచివేయడానికి ప్రయత్నిస్తున్నది?

జ. ప్రభుత్వము రాజకీయనాయకుల చేతిలో ఆటబొమ్మ అవుతుంది పాపం. రాజకీయ అధికారం సరియైన మార్గదర్శనం ఉంటే సేవగా ఉంటుంది. అలాలేనప్పుడు అదొకవ్యసనము - బలహీనముగా మారుతుంది.

- రష్యా చరిత్రలో జార్ చక్రవర్తుల సమయంలో ''క్వీన్ క్యాథరిన్'' అనే రాణి పరిపాలనకువస్తుంది. రాగానే మంత్రులను కూర్చోబెట్టి ''అధికారం ఎప్పుడూ మన చేతిలో ఉండాలంటే ఏంచేయాలి'' అని అడుగుతుంది. మాకు తెలీదు అన్న మంత్రులతో నేను చెప్పినట్టు చేయమంటుంది.

రాణి:- వీధి వీధికి పాఠశాలలు ప్రారంభించండి చదువు మాత్రం ఎవ్వరికీ రాకూడదు.

మంత్రులు:- చదువురాని దానికి స్కూళ్ళు ఎందుకు?

కంపల్సరీగా ప్రతి ఒక్కరిని స్కూళ్ళలో చేర్చండి.

మంత్రు:- చదువురాకుండా ఎలా చేయాలి?

రాణి:- పెద్దస్థాయి సిలబస్ పెట్టండి - ప్రమోషన్స్ ఇవ్వండి (చదువురాలేదనే అసంతృప్తి లేకుండా ముందుకు నెట్టండి)

మంత్రు:- మానసిక వికాసం పెరుగకపోతే - శరీరంతో పాటు కోర్కెలు పెరుగుతాయికదా! అప్పుడెలా?

రాణి:- కోర్కెలు పెరగడంకాదు - పెంచాలి అందుకు వ్యభిచారగృహాలకు లైసన్సు తాగుబోతులకు లైసన్సు - తాగుడు షాపులకు లైసన్సు కామాన్ని రేకెత్తించే సినిమాలు - కామాన్ని రెచ్చగొట్టే సాహిత్యం లాటరీలు - మత్తు నెక్కించే సిగరెట్టు - గుట్కా లాంటివి పెంచి - సామాన్యుడికి అందుబాటులో ఉండేలా చూడండి. అప్పుడువాడికి దేశం, ధర్మం లాంటి భావాలు పతనమై కనిపించేవాటిని అనుభవించడానికి 4 రూ. డబ్బులకు ఎదురుచూస్తాడు. ఆ డబ్బు వాడి ముఖాన పారెయ్ - మనిషిని కొనిపారేయ్ మన అధికారానికి అడ్డముండదు.'' అని 13 సం॥ల్లోగా 75% రష్యాను తన ఆధీనంలోకి తెచ్చుకుంది.

నేడు మన ముంటున్నది ఒక మానవ విలువలు వికాసం చెందే దేశమని మనకనిపిస్తుందా? లౌకిక రాజ్యం పేరుతో - కాశ్మీర్ నుండి 3 లక్షల మంది హిందూ సోదరదరీమణులు అక్కడ ఉన్న ముస్లిల అత్యాచారాలకు బలియై కట్టుకున్న బట్టతో కన్న బిడ్డలతో బికారులై భిక్షాటన చేసుకునే స్థాయికి దిగజారినా 2 కోట్ల మంది ముస్లింలు బంగ్లా, పాకిస్తాన్ నుండి చోరబాటుదారులుగా ఏ అనుమతి లేకుండా దేశంలో జీవిస్తున్నా ప్రతి నిత్యం అనేక దేవాలయాల్లో విగ్రహాల చోరీలు, ఆభరణాలచోరీలు విధర్మయులచే చేయబడుతున్నా - ప్రతిరోజు వేలాది గోమాతలను చంపి ఆ మాంసం అరేబియాదదేశాల సంతృప్తికి విక్రయించబడ్తున్నా వందేమాతరం గీతాన్ని లోక్‌సభలో నిరాకరించినా, చివరకు జనగణమణ పాడమని మిజోరాం క్రైస్తవులు నిరాకరించినా వేలాది ISI తీవ్రవాదులు జాతీయ సంపత్తిని విధ్వంచేస్తున్నా లక్షలాది చ.మైళ్ళ పవిత్ర భారత భూమి ప్రతిరోజు పరమతాల సంఖ్యాధిక్యతతో నిండి ఖండితమౌతున్నా కేవలం తమ ఓటు - నోటు - సీటు మాత్రమే లెక్కించుకొని అధికారంలో కొనసాగే నాయకులకు రామజన్మభూమి లాంటి ఉద్యమాలు మహమ్మదీయుల సంతృప్తి కొరకు అణచివేయబడకపోతే ఈ దేశభక్త ధర్మాశక్తులైన హిందూసమాజ శౌర్యధైర్య స్వాభిమానాలను ఎలా ప్రోత్సహించగల్గుతారండి.

మరి ఇలాంటి స్థితిలో పరిషత్ వైపు నుండి మీరేం చేయాలనుకుంటున్నారు?

ప్రజలను ఏరకంగా సరియైన మార్గంలోకి మళ్ళించగలరు? (వచ్చేసంచిక) — వై. రాఘవులు.

## హనుమజ్జయంతి

ముండ్లపాడు: ఉదయం 9 నుండి ఆంజనేయస్వామికి లక్షకుంకుమ పూజ, 150 కుటుంబాల దంపతులు పాల్గొన్నారు.

తర్వాత సహపంక్తి భోజనాలు. సా॥ 7 గంటల నుండి ఆంజనేయస్వామి సహస్రనామ పూజ వెయ్యి తమలపాకులు. 10 మంది దంపతులు శాస్త్రోక్తంగా పూజ. తర్వాత వి.హిం.ప. ప్రాంత కా.వర్గ సభ్యుడు. ధా॥వి. సుబ్బారావుగారు రామాయణంలో ఆంజనేయస్వామి పాత్రను వివరించి, భవిష్యత్తులోని కార్యక్రమాలు యువతకు వివరించారు.

(మా.వి.)

బంజారాలు చరిత్ర పూర్వ దశల్లో, వనచరులుగా పిలువ బడినారని, బంజార, వంజార అనే మాటలను బట్టి ఊహించవచ్చును. రామలక్ష్మణులు అడవిలో పాటలు పాడుతున్న చరణాలువల్ల సీత అపహరింపబడిన దన్న వార్తను తెలిసికొన్నట్లు, వాల్మీకి రామాయణంను బట్టి తెలుస్తుంది. సార్థ వాహులు అనెడి పేరుతో ఎద్దులపై ఆహారధాన్యములను సాగిస్తూ ఉండిన ఒకజాతి ఉన్నట్లు జైన బౌద్ధ వాజ్మయమును బట్టి తెలుస్తున్నది. దీనిని బట్టి ఈనాడు బంజారా అనుపేరుతో ఎవరిని గుర్తిస్తున్నామో, వారు ఆర్యుల కాలము నాటికే ఉన్నారని స్పష్టముగా చెప్పవచ్చును. బంజారాల చరిత్ర స్పష్టముగా మనకు తెలిసినంత వరకు క్రీ.శ. 11వ శతాబ్దము కాలములో రాజపుత్రులకును, మహమ్మదీయులకును జరిగిన సంఘర్షణతో మొదలవుతుంది. భుక్యాబాలాజిదాస్ మున్నగు బంజారా పెద్దలు, బంజారాలు ఆటవికులుగా మారడానికి, ముస్లిం దండయాత్రలే, కారణమని భావించారు. వారిస్త్రీలు తమశీలాన్ని రక్షించుకోవడానికి, వారి అందాన్ని కప్పిపుచ్చుకోవడానికి చేసిన ప్రయత్నమే, వారి అలంకరణలు, వేషభూషలు, అనాగరికముగా కనిపించడానికి కారణమన్నారు. వీరిప్రకారమే సుప్రసిద్ధ మరాఠీ బంజార పరిశోధకుడు బలీరాం పాటిల్ కుడా బంజారా ఇతిహాసాన్ని రచించారు. బంజారా గోత్రాలతో రాజపుత్రులగోత్రాలకు సంబంధ కల్పించటం వల్ల పై ఊహలు చారిత్రక సత్యాలు అనిచెప్ప వచ్చును. బంజారాల జన్యు రక్త పరీక్షను కూడా రాజపుత్రులతో వారి సంబంధాన్ని నిరూపిస్తున్నాయి. ఇటీవల బంజారాలకు, రోమాని జిప్సీలకు నడుమనున్న సంబంధంపైన 'కోకనాస్కీ' అన్న ఫ్రాన్స్ దేశస్థుడు (ఇతనుకూడా జన్మతహః జిప్సియే) విస్తృతముగా పరిశోధన చేశాడు. రాజపుత్రులు, బంజారాలు, జిప్సీలు శ్రీరాముని పుత్రులని అతనిప్రగాఢ విశ్వాసమున. బంజారాలు సింతి అనుపేరుతో (సింధు) క్రీ.పూ॥ యుగాలలోనే, యూరపుదేశాలకు వెళ్ళిపోయారని 'క్రిష్టఫర్క్లాత్' అనెడి ఫ్రెంచి పరిశోధకురాలు నిరూపించినది. ఈవిషయాలపై అఖిలభారత స్థాయిలో పరిశోధనలు చేసిన డా॥ శ్రీరామ శర్మ, ఆచార్య బ్రహ్మానందగారు, బంజారాలు తొలుత గిరిజన సమూహాలుగా ఉండి ఒక నిర్దిష్టకాలములో వారిలో కొందరు బలిష్ఠమైన గోర్జాజాతిగా రూపొంది ఈనాటి బంజారా, సుగాలి, లంబాడి మొదలైన జన సమూహాలుగా వలస క్రమములో చలిపోయారని భావిస్తున్నారు.

ఈనాడు ఉత్తరభారతదేశములో అధికంగానూ, దక్షిణభారతదేశములో తగు మాత్రంగా కనుపిస్తున్న బంజారాలు దాదాపు 3 కోట్లకు పైగా ఉండవచ్చునని పరిశోధకుల అంచనా, అయితే, ఒక పేరుతో ఒకచోట నిర్దిష్టముగా లేకపోవటం, ప్రక్కనున్న ప్రధాన సంస్కృతిలో కలిసిపోవటం కారణముగా గిరిజనసంఖ్య వివరాలు ప్రభుత్వ జనభా పట్టికలలో సరిగా నమోదు కావడంలేదు. అయినా ఉత్తరభారతంలో హిమాచల్ప్రదేశ్ కాశ్మీర్, పంజాబ్, గుజరాత్,మహారాష్ట్ర, ఉత్తరప్రదేశ్లలో అత్యధికంగానూ, దక్షిణ భారతంలో ఆంధ్ర, కర్ణాటక, తమిళనాడులలో ఎక్కువగానూ, కేరళలలో చాలా తక్కువగాను వ్యాపించి యున్నారు. బంజారాలు భిన్న వృత్తులలో ఉన్నారు. వృత్తులను బట్టి చాలాపేర్లతో వీరిని పిలుస్తారు కూడా, కొన్నింటిని చర్చిస్తాను.

'సుగాలి' అనుపదము సుగ్వాల శబ్దభావము అంటే గోపాలకులని అర్థము. లమాని, లంబాడా, లంబాఢి శబ్దాలలో లవణ శబ్దం మూలమని, ఒకప్పుడు పశ్చిమతీరప్రాంతం నుండి ఉప్పు తెచ్చి విక్రయిస్తున్న వారే లమాని ఇత్యాదులుగా పిలవబడ్డారు అనితెలుస్తుంది.

వాణిజ్యశబ్దముతో ముడిపడింది బణజార, వనచర శబ్దముతోముడి పడింది బంజార. సుర్కీలను తయారు చేసేవారు సుర్కీవాలో అని, ఎద్దులపై ధాన్య వర్తకం చేసేవారు లదనియ (లాదన) అని

ఇలాంటిపేర్లు 27 ఉన్నాయి. దీనిని " ఆల్ ఇండియా బంజారా స్టడి టీమ్ రిపోర్టు" గుర్తించింది.

1. బంజారా 2 బాంజారా 3. వనజారా 4. బంజరీ 5. బంజరి 6. బ్రింజారి 7. బ్రింజావాసీ, 8. లమాన్ 9. లామాన్‌ని (Or) లంబాని 10. లంబాణ 11. లంబాడీ 12. లబాన్ (లేక) లభాణ 13. లభాన్ 14. లభాని 15. లభాణ లేక లోబాణ 16. బలాడియ, 17. లదనియ 18. సుగాలి, 19. గవార్ (లేక) గౌరియా 20. గవారియా 21. గమాలియా 22. గవారా 23 కంగీ (లేక) కంగాషియా 24 ఫాండా 25 షిర్కీభాండ్ 26. షిర్కీవాలో 27. సింగాడి వంజరీ Note : Not the Vanjarer of Maharastra

(సశేషం)

## మోజెస్ (మూసా) ఒక హిందువు

– (రాజన్)

1. 'మోజెస్'ను 'మూసా' అని అంటారు – ఇది 'మహేశా' అసలు పదం. గ్రీకులు 'మహేశా'ను 'మహేషష్'గా ఉచ్ఛరిస్తూ చివరకు 'మోజెస్'గా పిలిచారు.
2. 'మూసా' 'మహేశా' సమానకాలు.
3. మోజెస్‌పైను నిందమోపిన స్త్రీ 'సులేఖ'ను – 'జులేఖ' అన్నారు.
4. (మహేశా) 'మోజెస్' నదిలో ప్రయాణిస్తుండగా ఆనది అతనికి దారియిచ్చినట్లున్న సందర్భం. భాగవతంలో శ్రీకృష్ణుని తీసుకెలుతున్న వాసుదేవునికి యమున దారి ఇవ్వడానికి నకలీ.
5. మోజెస్ 'పదికమాండెంట్స్' హిందూవే దాంత సూత్రాలు మాత్రమే.

---

## గమనిక

దేవాలయ నిధులను, ఆదాయములను ప్రభుత్వ కార్యక్రమములలో వినియోగించే ప్రభుత్వ వైఖరిని వి.హిం.ప. మఠ మందిర్ విభాగ్ ఖండిస్తున్నది. ప్రతి దేవాలయ నిర్వహణ విషయమై ప్రతి మూడు నెలలకు ఒక పర్యాయము ప్రముఖుల సమావేశము ఏర్పాటు చేయాలని, దేవాలయ భూములు, అన్యాక్రాంతం చేయరాదని మఠమందిర్ విభాగ్ ప్రభుత్వమును కోరుచున్నది. పై కార్యక్రమములు సక్రమనిర్వహణలో న్యాయపరమైన ప్రయత్నములో పాల్గొనదలచిన వారు యీ క్రింది చిరునామాకు సంప్రదించవలెను –

చిరునామా : ఎ.వి. శర్మ, అడ్వొకేట్, విజయశ్రీ 4-5-212, కోఠి. భాగ్యనగర్, విశ్వహైందవం – 6

విశ్వహిందూపరిషత్ విభాగమైన 'దుర్గావాహిని' యొక్క పశ్చిమ ఆంధ్ర విభాగ్ 6-జూన్ నుండి 10 జూన్ వరకు ఐదు రోజులు శిబిరం భాగ్యనగరంలో నిర్వహించబడినది. ఇందులో యాభైకిపైగా యువతులు, సభ్యులు పాల్గొన్నారు. ప్రతి రోజుకు మూడు గంటలు శారీరక కృత్యాలు చేయించారు. ఇందులో కరాటే, యోగా, దండయుద్ధాలు మరియు ఇతర సాహసంతో కూడిన ఆటలు నేర్పినారు. శిబిర ప్రారంభోత్సవానికి దక్షిణ భారత సంఘటనా కార్యదర్శి శ్రీ బాబూరావు దేశాయి గారు, దక్షిణ భారత సహ సంఘటనా కార్యదర్శి శ్రీ వై రాఘవులు గారు, లాంటి ఇతర పెద్దలు విచ్చేసినారు. జూన్ పదవ తారీఖున జరిగిన సమారోప కార్యక్రమంలో శ్రీ అచ్యుతరామ శాస్త్రిగారు సమావేశాన్ని ఉద్దేశిస్తూ మహిళలు ఆత్మ నిర్భరత కలిగి ఉండాలని, వారిలో ఆత్మవిశ్వాసం యొక్క నిర్మాణం జరగాలని అని అన్నారు. అశ్లీలతకు వ్యతిరేకంగా మహిళలు జాగ్రుతులై ఝాన్సీ లక్ష్మీబాయి, రాణిరుద్రమదేవి, అహల్యా బాయి హోల్కర్ వంటి వారిని ఆదర్శంగా తీసుకొని ఆత్మ విశ్వాసంతో తమకై తమ రక్షణకై, పోరాటం సల జరపాలి. మరి జాతి ఉద్ధరణకై పోరాటం జరపాలి అన్నారు. మహిళలకు ఇతరులను తమ మాట వినేట్టుగా చేయడం అన్నది దేవుడిచ్చిన వరం. అందుకే వారు ఈ తమ సుగుణాన్ని, హిందూ ఐక్యతపై ఉపయోగించాలి. ఈ ముగింపు సమావేశానికి జి. పుల్లారెడ్డిగారు ముఖ్య అతిథిగా విచ్చేశారు. శిబిరం ముగింపు తర్వాత కూడా ఈ మహిళలు నూతనోత్సాహంతో వారి కార్యక్రమాలు ఈ శిబిరం వరకే పరిమితం కాకుండా మిగిలిన సమాయాల్లో కూడా స్వయంగా పాల్గొనాలి అన్నారు. ఈ శిబిరం ముగింపుతోనే వారి అసలు కార్యక్రమం మొదలవుతుంది. హిందూ ఐక్యతకై వారి జీవితాంతం కృషి చేయాలి అని అన్నారు. శ్రీమతి విజయలక్ష్మిగారు, (అనంతపూరు విభాగ మహిళా ప్రముఖులు) శ్రీమతి వరలక్ష్మిగారు, ప్రాంతీయ దుర్గావాహిని ప్రముఖులు), శ్రీమతి సుగుణ గారు (భాగ్యనగర విభాగ మహిళా ప్రముఖులు) శిబిరం విజయవంతంగా నిర్వహించేందుకు ప్రత్యేకమైన కృషి జరిపారు.

శ్రీమతి చాముండేశ్వరి గారు (ప్రాంత మహిళా ప్రముఖులు) శిబిర నిర్వహణ చేశారు.

దుర్గావాహిని ఎంత పటిష్టంగా పెరిగి, ఎంత త్వరగా వ్యాప్తి చెందుతుందో, అంతే త్వరగా హిందూ సమైక్యతకీ మేలు జరుగుతుంది. ప్రతి మహిళ కూడ ఈ చైతన్యాన్ని ఆకలింపు చేసుకొని, హిందూ ప్రయోజనాలకై కృషి చేయాలి అన్నారు.

వార్త.

ప్రమోద్ వళసంగ్ కర్

## సత్యం

– ఆర్. రామకృష్ణా రావు

నేను దిగంబరుణ్ణే
పుట్టినప్పుడు,
పోయేటప్పుడు!
ఇళ్లే కైలాసం

గంగలేనిదే
గడవదు క్షణం
సగభాగం పుణ్యం
సుకుంటూ

ప్రాణేశ్వరి నన్ను
అర్ధనారీశ్వరుణ్ణే చేసింది!
శరీరమే శ్మశానం,
జీవేశ్వరుని నివాసం
నిరంతరం జఠరాగ్ని
ఆహారాన్ని
భస్మం చేస్తూనేవుంది
అనునిత్యం అది
రగులుతూనే వుంటుంది!

అజ్ఞానాంధకారాన్ని
మనోజ్ఞానంతో
భస్మంచేస్తాను
ముక్కంటి నౌతాను!
నేనెవరో తెలుసుకున్నాను,
జీవేశ్వరుడే సర్వేశ్వరుడు,
సర్వేశ్వరుడే జీవేశ్వరుడు!
లేదు – దీనికి మించిన సత్యం
ఇదే ఈశ్వర తత్వం

బంగ్లాదేశ్‌లో చుట్టాగ్రాంహిల్స్ 5138 చ.మైళ్ళ జిల్లా. 1860లో ట్రైబల్స్‌కొరకు ఏర్పరచబడ్డది. 1964లో అప్పటి పాక్ ప్రభుత్వం గిరిజన ప్రతిపత్తిపి తోలగించింది. 1976లో బంగ్లా ప్రభుత్వం దాన్ని మూడు జిల్లాలుగా విభజించింది. అందులో మాగ్, నావోటియా, చక్మాలు, సంథాలు తెగలవారు షుమారు ఆరు లక్షలు. వారు 99 శాతం బౌద్ధులు, హిందువులు అవడం చేత 1947 ఆగష్టులో భారతజాతీయ జండా ఎగురవేయబడ్డది.

1947 ఆగష్టు 21న అప్పటి పాక్‌సైనికలు ఆప్రాంతాన్ని వశం చేసికొని ఇస్లామీగా మార్చే ప్రయత్నాలు కొనసాగిస్తున్నారు.

బర్మా ఆరకాన్ ప్రాంతంనుడి తరిమివేయబడ్డ ముస్లింలు చుట్టాగ్రాంలో తలదాచుకొన్నారు. బంగ్లాలో భూమిలేని ముస్లిం పేదలకు చట్టాగ్రాంకొండల్లో భూావసతి కల్పించిపంపారు. చట్టాగ్రాంలోని గిరిజనులకు ఎడాపెడా బాధలు. గృహదహనాలు, మతమార్పిడులు, దోపిడీలు, మానభంగాలకు గురైనారు. స్వీయ రక్షణకై ప్రయత్నించిన వారిని ముస్లింసేనలు నిర్దాక్షిణ్యంగా వధించారు. హిందూ దేవాలయాలు, విహారాలు, మసీదులు, దర్గాలు, మదరసాలుగా మార్చబడ్డాయి.

1947 నుండి ముస్లిం తెగలు చుట్టాగ్రాం హిల్స్‌లోకి జొరబడడం బౌద్ధులు, హిందువులు హిల్స్ నుండి భారతకు వలస రావడం జరుగుతుంది. నలభైయేండ్ల నుండి చిన్న చిన్న ముఠాలుగా వచ్చి భారత్‌లో తలదాచుకొంటున్నారు. 1965, 1978 సంవత్సరాల్లో పెద్ద సంఖ్యలో భారత్‌కొచ్చారు. కాని 1986 మే 3 నుండి 36000మంది భారత్‌లోకి రావడం జరిగింది. వారికి తకుంబరీలో 15500; కొర్బుక్‌లో 5750; సిల్‌చెర్రీలో 4850; బాగేబరిలో 2150; కథాల్‌చెరీలో 6750 మందికి భారతప్రభుత్వం పునరావాసం కల్పించింది. అందులో విద్యావంతులు, బంగ్లాదేశ్‌లో ప్రధాన పదవులు నిర్వహిస్తున్నవారూవున్నారు. ఉపాధ్యాయులు, డాక్టర్లు, బౌద్ధసన్యాసులు ఉన్నారు. ప్రాథమిక విద్యనుండి కళాశాల వరకు చదువుచున్న విద్యార్థిని, విద్యార్థులు 8000లకు పైగా వున్నారు. పైగా శరణార్థులలో భాగ్యవంతులు, నాగరికులు విద్యావేత్తలు వున్నారు. వారంతా బంగ్లా దేశదౌష్ట్యానికి గురికాబడ్డారు.

ప్రథమంలో భారతప్రభుత్వం దీన్ని తాత్కాలిక సమస్యగా పరిగిణించింది. బంగ్లా ప్రభుత్వంతో సంప్రతింపులు జరిపితిరిగి శరణార్థులను పంపప్రయత్నించింది. కాని సమస్యతీరక పోగా జటిలమై శరణార్థులు స్వస్థలంచేరే అవకాశం బంగ్లాదేశ్ కల్పించక పోవడంతో 1971 సంవత్సరంనాటి విముక్తి యుద్ధావసరం ఏర్పడుతోంది.

విశ్వహిందూపరిషత్ వారు వస్త్రాలువగైరా శరణార్థులకు సరఫరా చేస్తున్నారు.

శరణార్థుల కు పునరావాస సౌకర్యాలు ఆరోగ్యకరంగా లేవు. ప్రభుత్వంవారు రేషన్ సరఫరా చేస్తున్నారు. వర్షాకాలంలో నివసించే వసతి చాల కొరవడివుంది. విద్యా సౌకార్యాలు తగినంతగాలేవు. భావి పౌరులేమై పోవాలి.

చక్మాల విషమస్థితినుండి బయలుపడి స్వస్థలం చేరే గట్టి చర్యలు భారత ప్రభుత్వం తక్షణం తీసికొనేట్లు చేయడం ప్రతిభారతీయుని కాదర్శమైయున్నది. ('హిందూవిశ్వ' నుండి)








1. భాగ్యనగర్ సంస్కృత సమ్మేళనంలో మార్గదర్శనం చేసిన
ఆచార్య సుమన్‌జీ (శాలువాధారి) మరియు వి.హిం.ప అధినేతలు – కార్యకర్తలు.
2. తీర్మానాలు ఓంకార ఆమోదముద్రలో ప్రతినిధులు.